Issued on 23—3—1957







# THE ANDHRA LEGISLATIVE ASSEMELY

# DEBATES

## OFFICIAL REPORT

*WEDNESDAY, the 4th APRIL. 1956.*

VOLUME VII — No. 3.

CONTENTS



---

PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 4th April* 1956.

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair

## I. QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS.

*Revision of pay scales of teachers.*

700—

* 1028 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government have revised the pay scales of teachers in the State with effect from 1955-56 ; and

(b) if so, the cadre of the teachers to whom the revised pay scales will be given effect to ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఈ సంవత్సరము (1956-57)లో ప్రభుత్వయాజమాన్యము క్రిందకు తీసుకున్న schools లో pay scales ఏ విధంగా ఉంటాయి ?

THE HON. DR. B. GOPALA REDDI :—జిల్లాబోర్డుల స్కేల్సు ఇవ్వాలని మా ఉద్దేశ్యము.

SRI B. SANKARAIAH :—అధ్యక్షా, అఖిలభారత ఉపాధ్యాయ సంఘం ఇదివరకు ఈ scales ను పెంపుచేయువిషయంలో కేంద్రప్రభుత్వంవారిని అడిగింది ఆ విషయము పత్రికలద్వారా వచ్చింది. అందువల్ల ఉపాధ్యాయులకు జీతాలు పెంచే విషయములో కేంద్రప్రభుత్వము ఏమైనా సూచనలు చేసిందా ?

[4th April 1956

THE HON. DR. B. GOPALA REDDI :—వాళ్లు కొన్ని సూచనలు చేశారు. ఇంకా జీతాలు ఎక్కువచేస్తే బాగుంటుంది అన్నారు. దానికి ఈ ప్రభుత్వముయొక్క బాధ్యతకూడా ఉన్నది. అందువల్ల ఆ విషయం ఆలోచిస్తున్నాము.

SRI M. RAJARAM :—అధ్యక్షా, ఉపాధ్యాయుల జీతాలు పెంచుటకు డబ్బులేదని ప్రభుత్వమువారు చెబుతున్నారు. డబ్బువచ్చినతరువాతనైనా పెంచుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—డబ్బు సంపూర్ణంగా వచ్చిన తరువాత ఆలోచిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, కేంద్రప్రభుత్వమువారు పంపిన సూచనలు ఏమిటి ? ఎంతజీతము ఎక్కువ చేయమన్నారు ?

THE HON. DR. B. GOPALA REDDI :—హుమాయూన్ కబీర్ గారు కొన్ని D. O. letters వ్రాస్తూ వచ్చినారు. ఎలిమెంటరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతములు తక్కువగాయున్నాయి, హెచ్చుచేస్తే బాగుంటుంది అని మాత్రమే అన్నారు. కాని మేము ఇంత ఇస్తాము అని ఖచ్చితంగా promise చేయలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, వచ్చేది ఏమైనాఇస్తారా అని మన ప్రభుత్వంవారు note పంపించారా ?

THE HON. DR. B. GOPALA REDDI:—పంపించాము. జవాబు [illegible]

SRI M. NAGI REDDI :—అధ్యక్షా, జిల్లాబోర్డుల అధ్వర్యములో యున్న ఎలిమెంటరీ స్కూల్సులో హయ్యరుగ్రేడు పోస్టులో, సెకండరిగ్రేడువారు [illegible] వారికి హయ్యరుగ్రేడు జీతమే ఇస్తున్నదాని విషయం ఇదివరకు అడిగితే [illegible] ఆలోచిస్తాము అన్నారు. అది ఆలోచించారా ? ప్రభుత్వ గ్రాంట్సు [illegible] ఏ పోస్టులో పనిచేస్తున్నా సెకండరీగ్రేడు ప్యాసుఅయితే వారికి [illegible] ఇస్తున్నారు. అందువల్ల ఆ విధముగా జిల్లాబోర్డు స్కూళ్లలో [illegible]

THE HON. DR. B. GOPALA REDDI:—ఇది చాలా దీర్ఘమైన [illegible] qualifications ఉన్నవారువస్తే, ఆ పోస్టులకు

సరిపడ్డజీతం ఇవ్వాలా ? లేక వారికి qualifications ఉన్నవి కాబట్టి ఎక్కువ జీతం ఇవ్వాలా ? లోయరు డివిజను గుమాస్తా ఉద్యోగమునకు M. A. ప్యాసు అయినవారువస్తే, వారికి ఆగుమాస్తాకి ఇచ్చేజీతం ఇవ్వాలా ? లేక వారు M. A. ప్యాసుఅయినారు కాబట్టి ఎక్కువ జీతం ఇవ్వాలా ? అందువల్ల ఇది సాధ్యంఅయ్యే పనికాదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయులకు జీతములు ఎక్కువ చేయుటకొరకు, కేంద్ర ప్రభుత్వమును ఆర్థిక సహాయము చేయమని కోరుటకు, మన మంత్రివర్గమునకు ఏమైనా అభిప్రాయము ఉన్నదా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఎలాంటి అభ్యంతరము లేదు.

SRI P. ANTHONY REDDI :—అధ్యక్షా, 5వ class వరకు ఉన్న Schools యొక్క Head Masters గా Secondary Grade Pass అయిన వారు ఉండాలని 1938-39 సంవత్సరములో ఒక G.O. ఉన్నది. అందువల్ల ఆ schools లో Head Masters గా చేసిన Secondary Grade వారికి Secondary Grade జీతము ఇచ్చుటకు ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON. DR. B. GOPALA REDDI :—తప్పకుండా, సానుభూతి పూర్వకంగా ఆలోచిస్తాము.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, వారందరికీ కూడా గవర్నమెంటు స్కేల్సు ఇస్తే ఎంత డబ్బు ఖర్చుఅవుతుందో చెప్పగలరా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఏ 2, 3 కోట్లు అయినా అవుతుందేమో.

*Salaries of teachers in single teacher schools.*

701—

*** 861 Q.—SRI P. GUNNAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state :**

(a) whether it is a fact that the salaries of teachers on single teacher schools under Andhra Government are not in a par with those employed under Central Government ; and

(b) if so, the reasons therefor ?

THE HON. DR B. GOPALA REDDI :—

(a) The member evidently refers to disparity in scales of pay of teachers employed in Elementary Schools opened under normal expansion and of those employed in schools opened under the scheme for the relief of educated unemployed. The answer is in the affirmative.

(b) The Secondary Grade trained teachers are employed in schools opened under the scheme for the relief of educated unemployed, whereas Higher Grade trained teachers are generally appointed in other Elementary Schools. The disparity is due to the existence of difference in the scales of pay between the Secondary and Higher Grades.

SRI L. LAKSHMANA DAS.—అధ్యక్షా, Central Government నడుపుతున్న Schools లో S.S.L.C. pass అయిన వారిని వేస్తున్నారు. అదే మాదిరిగా S.S.L.C. pass అయిన వారినే single teacher schools లో ఉపాధ్యాయులుగా వేశారు, వారి జీతములలో చాలా భేదము ఉన్నది. అందువల్ల అటువంటి భేదము లేకుండా ఆలోచిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—Government of India వారు ఇచ్చే ద్రవ్యముతో ఈ Single Teacher schools ను, కేవలం చదువుకున్న వారిలో ఉన్న నిరుద్యోగమును కొంతవరకు తీర్చుటకు నడుపుతున్నాము.

"It has been fixed at Rs. 40—1½—55/2—75. With the usual scale of dearness allowance as in the case of fully qualified secondary grade teachers while the untrained teachers are allowed the fixed pay of Rs. 40 plus the usual dearness allowance The intention in adopting the scale of Rs. 40—1½—55 was to recruit only secondary trained and untrained teachers who are holders of S. S. L. C. or a pass certificate in Matriculation."

SRI S. VEMAYYA.—అధ్యక్షా, ఈ Single Teacher schools ను [illegible] maintain చేయు schools ను average attendance లో [illegible] ఉన్నదా ?

4th April 1956]

THE HON. DR. B. GOPALA REDDI:—ఇవన్నీ కూడా, చిన్న చిన్న గ్రామాలలో, అసలు schools లేనిచోట, పెట్టారు. Average attendance గురించి తెలియదు. అసలు transfers లేకుండా ఆ ఊరిలోనే 3 సంవత్సరములు ఉంటానని ఉపాధ్యాయుడు గ్యారంటీ ఇవ్వాలి. అందువల్ల వారికి ప్రభుత్వం కొంత ప్రోత్సాహము ఇస్తుంది

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, వీరిద్దరికి ఒకే qualifications ఉన్నప్పుడు, ఒకే రకపు జీతాలు ఇవ్వడానికి అభ్యంతరము ఏమి ఉన్నది ? ఈ ఉద్యోగములు జిల్లా బోర్డులు ఇస్తున్నాయి గనుక, వారికి అప్తులు వుంటే, వారిని Central Government schools కు పంపడము, కొత్త వాళ్లను రాష్ట్ర ప్రభుత్వ schools కు పంపడము జరుగుతున్నది. అందువల్ల ఇటువంటి అవకతవకలు లేకుండా ఏమైనా ప్రయత్నము చేస్తారా ?

THE. HON. DR. B. GOPALA REDDI :—వీరిద్దరికి జీతములలో తేడా ఉన్నమాట నిజమే. కాని అప్తులను Central Government Schoolsకు పంపడం, కొత్తవారిని Provincial Government Schools కు పంపడం అనేది సరికాదు. వీరు ఉన్న గ్రామములో, ఎప్పుడూ Schools అనేవి లేని గ్రామములో వీరు పోయి Schools పెట్టాలి. దానికి కావలసిన విషయములు సేకరించాలి, ఉత్సాహంగా యుండాలి. ఇటువంటి తేడాలు ఉన్నాయి కాబట్టే జీతములలో తేడా యున్నది.

*Bridge near Dwarapudi in East Godavari District.*

702—

* 1072 Q.—SRI T. LAKSHMINARAYANA REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state .

(a) whether the Government are aware that the 'Bridge' near Dwarapudi in East Godavari District on the Dowleswaram—Samalkota Canal is in a state of disrepair ; and

(b) if so, the action taken by the Government to repair the same ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) A proposal to reconstruct the bridge is under consideration.

*'Rammed-Earth' Houses in the State.*

703—

*1021 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether it is a fact that the Government have sanctioned a scheme of 'Rammed-Earth' Houses in the State now , and

(b) if so, what the details of the scheme are ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) With a view to minimise the large number of fire accidents occurring in the State, it has been proposed to experiment a scheme for the construction of houses with Rammed-earth with technical assistance to be given in the shape of providing steel frames, clay etc. The Government sanctioned an amount of Rs. 8,196 for giving technical assistance by way of providing steel frames and giving advice regarding the clay etc., to be used for the construction of the houses. An amount of Rs. 27,000 has also been sanctioned for the grant of loans at the rate of Rs. 180 for each house under the scheme to meet the cost of the construction of the Rammed-earth houses.

SRI S. VEMAYYA :—ఈ స్కీము ఎప్పటినుంచి అమలులోనికి వస్తుంది? [illegible] ఏయే జిల్లాలలో ప్రారంభించుటకు ప్రభుత్వం ఆలోచిస్తున్నది?

THE HON. SRI K. CHANDRAMOULI :—అనంతపురం జిల్లాలోని 4 [illegible] experimental గా ప్రారంభించాము. సాధ్యమైనంత [illegible] తేవడానికి ప్రయత్నం చేస్తాము.

4th April 1956]

SRI. S. VEMAYYA :—ఈ స్కీములను అమలుపరచుటకు ఎటువంటి ప్రాంతములు అనుకూలంగా ఉంటాయి ? అనంతపురం జిల్లాలోనే ప్రారంభించుటకు గల కారణాలేమిటి ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంకొక ప్రాంతంలో ప్రారంభించినట్లయితే అక్కడ ఎందుకు ప్రారంభించారనే ప్రశ్న వస్తుంది. Experimental గా ఒక ప్రాంతమును select చేశారు అది బాగున్నట్లయితే తరువాత అన్ని ప్రాంతాలలోను అమలుపరచుకొనవచ్చు.

Sri N. K. LINGAM :—అధ్యక్షా, అసలు ఈ స్కీము ఉద్దేశ్య ఏమిటి? Rammed earth అంటే ఏమిటి ? కొంచెం వివరిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—అగ్ని ప్రమాదములకు గురికాకుండా ఉండడానికి ఆ స్కీము ఉద్దేశింపబడింది. ఇది ఇంకా experimental stage లో ఉన్నది. ఇది చూస్తేగాని ఎంతవరకు జయప్రదం అవుతుందో తెలియదు.

Sri M. RAJARAM :— Rammed earth అంటే ఏమిటి? దీని సిద్ధాంతం ఏమిటి ?

THE HON. SRI K. CHANDRAMOULI :—నిప్పుతో తగుల బెట్టినప్పటికీ తగులబడని పదార్థాలతో చేస్తారు. దానిని rammed earth అంటారు.

AN HON. MEMBER :—అధ్యక్షా, అనంతపురం జిల్లాలో 4 ప్రాంతాలలో దీనిని అమలుపరుస్తున్నామన్నారు. అవి ఏయే ప్రాంతములోనో సెలవిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—అనంతపురం జిల్లాలోని 4 ప్రాంతములు. అవి ఏయే ప్రాంతములో ఇంకా నిర్ధారణ కాలేదు. Collector గారు పరిశీలించి ఆ ప్రాంతాలను select చేస్తారు.

SRI N. SRINIVASA RAO :—రాష్ట్రంలో ఏయే ప్రాంతములలో ఎక్కువగా అగ్నిప్రమాదములు జరుగుతున్నాయో పరిశీలించి, ఆయా ప్రాంతములలో ఈ స్కీమును అమలుజరుపుటకు ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇది ఎటువంటి ప్రాంతములలో అమలుజరిపితే జయప్రదం అవుతుందో పరిశీలించాలి, ఇప్పుడు ఇంకా experimental stage లో ఉన్నది.

SRI R. B. RAMAKRISHNA RAJU :—అగ్ని ప్రమాదములకు Rammed earth కు ఏమి సంబంధమున్నదో నాకు తెలియదు. అగ్నిప్రమాదములు వచ్చినప్పుడు పైనఉన్న కప్పులు తగులబడతాయి. అటువంటిటప్పుడు Rammed earth వలన ప్రమాదములనుండి ఎట్లా తప్పించుకొనగల్గుతాము?

THE HON. SRI K. CHANDRAMOULI :—Rammed earth అనేది ఇండ్ల పైకప్పుమీదకూడ ఉపయోగించుటకు వీలుంటుంది. దీంట్లో steel మొదలగునవి ఉంటాయి. దీనివలన అగ్నిప్రమాదములు తగ్గుటకు వీలున్నది.

SRI M. NAGI REDDI :—ఒక్కొక్క ఇంటికి 180 రూ॥లు ప్రభుత్వం ఇస్తున్నదని మంత్రిగారు చెప్పారు. అసలు ఆ ఇండ్లకు ఎంతడబ్బు కావాలి? 180 రూ॥లు కంటె ఎక్కువ కావలసివచ్చినట్లయితే ఇంటియజమానులు భరించుకొనవలెనా? లేక Co-operative societies భరించాలా?

THE HON. SRI K. CHANDRAMOULI :—దీనికి ఇంకా correct గా అంచనాలు వేయలేదు. రు. 180 లు అవుతుందని ఉజ్జాయింపుగా లెక్కవేశారు.

*Reservation of the specific fields of production to the handlooms.*

704—

*846-F. Q.—SRI PRAGADA KOTAIAH :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

the action taken on the representation presented to the Governor on 11th January 1956 by the Andhra State Hand-loom Weavers' Congress, requesting the Government to recommend to the Government of India to reserve to the handlooms specific fields of production covering at least sarees and dhoties and to bring into being a financial corporation to finance the Weavers' Co-operatives to start with ?

THE HON. SRI D. SANJIVAYYA :—

The representation referred to is under consideration of Government.

ఈ జవాబు తయారైన తర్వాత నేను, ప్లానింగ్ శాఖామాత్యులు మాట్లాడి a separate Finance Corporation పెట్టేటందుకు నిర్ణయం తీసుకున్నాము.

SRI PRAGADA KOTIAH :—అధ్యక్షా, మొదటి భాగమునకు సమాధానం రాలేదండీ. చీరలు, ధోవతులు కేటాయించే విషయమై మన ప్రభుత్వం వారు ఇండియా ప్రభుత్వమునకు శిఫార్సుచేసినారా ? వారిదగ్గరనుంచి సమాధానం Finance Corporation పెట్టేలోపల ఒక Special officer ను నియమిస్తున్నా వచ్చినదా ? మన్నారు. నియమించడం జరిగినదా ?

THE HON. SRI D. SANJIVAYYA :— ఈ విషయమై ఇండియా ప్రభుత్వమునకు వ్రాసినాము. వారు ఇప్పుడు coloured sarees కు కొంత reserve చేశారు. మనం అడిగినరీతిగా complete గా reserve చేయలేదు. అది ఇంకా ఆలోచనలోనున్నది. దీనిని గురించి ఒకకమిటీని నియమించారు. ఆ కమిటీ శిఫార్సులు కేంద్రప్రభుత్వమునకు అందినవి. వాటిని పరిశీలించిన తరువాత నిర్ణయం చేస్తారనుకొంటున్నాను. త్వరలోనే Finance Corporation కు special officer ను నియమిస్తారు

SRI PRAGADA KOTAIAH :—Coloured sarees export విషయంలో Mills తయారుచేసేవాటిని మనదేశంలోనే విడుదల చేస్తున్నాయి. ఈ విధంగా చేయకుండా చూడవలసిందని గవర్నరుగారికిచ్చిన Memorandumలో తెలియజేశాము. ఆ విషయమై కేంద్రప్రభుత్వానికి తెలియజేశారా ? అట్లయితే ఏమైనా సమాధానం వచ్చినదా ?

THE HON. SRI D. SANJIVAYYA :—చేనేత పరిశ్రమకు సంబంధించి గవర్నరుగారికి సమర్పించుకొన్న నివేదికలోని అంశములను కేంద్రప్రభుత్వం వారికి తెలియబరచినాము. అక్కడనుంచి ఇంతవరకు సమాధానంరాలేదు.

SRI B. SANAKARAIAH :—Complete reservation అనేది న్యాయమే నని ప్రభుత్వం భావిస్తుందా ? దానిని గురించి ఏమేమి చర్యలు తీసుకొంటుంది ? ఇదివరకు మద్రాసు అసెంబ్లీలోనే తీర్మానం చేసినాము. ప్రభుత్వం ఏస్థాయిలో చర్యలు తీసుకుంటోంది?

THE HON. SRI D. SANJIVAYYA :—మద్రాసుప్రభుత్వం తీర్మానం చేసినదానికి అనుకూలంగానే మన ప్రభుత్వంకూడ తీర్మానించి భారతప్రభుత్వానికి పంపినది. ఇది న్యాయమైనట్టి వంటిది. తప్పకుండా చేయాలనికూడా వారికి తెలియజేశాము

*Supply of Electricity to Singanamala.*

705—

*969 Q.—SRI T RAMACHANDRA REDDI :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the scheme for the extension of electric power from Garladinne to Singanamala (Anantapur taluk) has been submitted to the Government ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

(a) ఈ స్కీము ప్రభుత్వానికి ఇంకా అందలేదు; అందువలన ('b') ప్రశ్నకు అవకాశంలేదు.

SRI T. RAMACHANDRA REDDI :—ఆ ప్రాంతం క్షామమునకు తరచుగుఱి అవుతూ ఉంటుందని ప్రసిద్ధికెక్కినది. ఆ ప్రాంతంలోని వారంతా సేద్యం చేసుకొనుటకు బావులపై ఆధారపడివున్నారు. విద్యుచ్ఛక్తి అక్కడ అత్యవసరం. విద్యుచ్ఛక్తి ఎందుకు పంపించలేదో తెలియచేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—అది ఇంజనీర్ల యొక్క పరిశీలనలోవున్నది. కలదిన్నె, సింగనమల, లోల్లూరు, జమ్ములదిన్నె, చెన్నవరం, నర్సాపురం గ్రామములకు విద్యుచ్ఛక్తి సరఫరాచేయడానికి సుమారు రు. 3,40 వేల ఖర్చుతో ఒకస్కీము తయారైనది. ప్రభుత్వం నిర్ణయించినటువంటి సూత్రంప్రకారంగా దీనిపై return రానందువల్ల ఇండియా ప్రభుత్వమునకు పంపలేకపోయినామని ఇంజనీరులు తెలియజేశారు.

SRI T. RAMACHANDRA REDDI :—గార్లదిన్నెకు ప్రక్కన మర్తాడు, బాగాచిపల్లె, తిమ్మన్నపేట అనే గ్రామాలలో బావులు ఎక్కువగా ఉన్నాయి. ఆ గ్రామాలనుకూడా చేర్చుతామని ఇంజనీరుగారు చెప్పినారు. [illegible] renumerative కావటంలేదన్నారేమిటి ?

THE HON. SRI G. LATCHANNA :—ఇంజనీరులు దగ్గరనుంచివచ్చిన [illegible] చేశాము. వారు ఈ గ్రామాలజాబితా ఇచ్చారు. [illegible] ప్రకారం return 8·9% అయినందువలన "మేము ఇవ్వ

లేకపోయినామని'' తెలియజేశారు. ఇప్పుడు గౌరవసభ్యులు చెప్పిన గ్రామాలలోని రైతులచేత మహాజరులు పెట్టించినట్లయితే ఈ వ్యవహారాన్ని investigate చేస్తారు.

SRI S. NARAYANAPPA :—8.9% return అయినప్పటికీ వెనుకపడిన ప్రాంతమనే భావంతో దానికి priority యిచ్చి ఈస్కీము వెంటనే అమలు జరుపుటకు ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—వెనుకబడిన ప్రాంతాలకు priority ఇవ్వాలనే ఉద్దేశ్యంతోనే 11% ఉన్నదానిని 10% కు తగ్గించడమైనది.

SRI N. K. LINGAM :—అధ్యక్షా! ఈస్కీము తయారుచేసే పద్ధతి ఏమిటి? ఒకతాలూకావారీగానా? జిల్లావారీగానా? ఫిర్కావారీగానా? తాలూకాలకు లేకుండా పల్లెటూరులకు ఇవ్వాలనే ఉద్దేశ్యంతో తయారుచేసినారా? అసలు దీని సిద్ధాంతం ఏమిటి?

MR. SPEAKER :—A seperate question may be put.

*Control of "Anthrax".*

707—

*1144 Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) the steps taken by the Government to control "Anthrax" in sheep in the State now ; and

(b) if so, what the nature of the remedy is ?

THE HON. SRI K. OBULA REDDI :—

(a) Vaccination of the apparently healthy stock of sheep with spore vaccine is conducted in actual out-break of Anthrax after confirmation of the disease from the laboratory. Preventive measures are also adopted for checking the out-break of this desease by vaccination with spore vaccine.

(b) No remedial measures are possible as the course of the disease is very short. Cure with the latest antibioties or sulpha drugs is still in the experimental stage.

[4th April 1956

SRI K. SUBBA RAO :—ఆఫీసులో పొరపాటుగా control of Anthrax అనే దానికి Control of Anthras అని వచ్చింది. ఆ సంగతి ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI K. OBULA REDDI :—టైపుచేయడంలో తప్పు వచ్చి ఉంటుంది.

*Bridge over K. C. Canal.*

708—

*745 Q.—SRI B. V. SUBBA REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether it is a fact that the bridge over K. C. Canal in 9th mile of Koilkuntla-Allagadda Road is very narrow and that the turn is a very sharp and steep one and that considerable difficulty is felt for negotiating the turn by the Motor Vehicles and Double Bullock carts ; and

(b) whether it is a fact that this was brought to the notice of the P.W.D. Executive Engineer . and the Divisional Engineer (Highways) by the Members of District Planning Committees at the meeting held in June 1955 and if so, the action taken by the officers thereon ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) and (b) The answer is in the affirmative.
The matter is receiving attention.

SRI B. V. SUBBA REDDI :—అధ్యక్షా మహాశయా, ఈ వంతెనల విషయంలో P.W.D. వారికి చెప్పినప్పుడు మాకు సంబంధం లేదని High ways Department వారికి చెప్పినప్పుడు, మాకు సంబంధంలేదని చెప్తున్నారు. ఈ రెండు శాఖలు ఒకే మంత్రిగారు నిర్వహిస్తున్నారు. కాబట్టి ఇది ఏ శాఖకు సంబంధించినదో తెలియజేసి ఈ విషయమై వెంటనే చర్య తీసుకొంటారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Collector గారి District Planing Commitees meeting లో discuss చేసినప్పుడు Subba Reddi Garu [illegible] ఉన్నారనుకొంటాను! వారు Government [illegible] వా వరకు రాలేదు. వచ్చినప్పుడు అది ఏ శాఖలోనిది [illegible] పనికదా [illegible] పనిచేయడాని [illegible]

*Occupation of Government land without permission.*

709—

*893 Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether it is a fact that the mother of the Village Munsiff of Rajupalem, Kovur Taluk, Nellore District is in occupation of Government land without permission ;

(b) if so, the reason for not having taken any action in Fasli 1364 ; and

(c) whether she is allowed to cultivate the same in current fasli ?

THE HON. SRI. K. CHANDRAMOULI :—

(a) The answer is in the negative.

(b) and (c) : Do not arise.

SRI S. VEMAYYA :—అంతకు ముందు ఫసలీలో గాని దరిమిలా ఫసలీలో గాని ఆ గ్రామోద్యోగి తల్లిగారుగాని బంధువులుగాని సాగుచేశారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేమయ్యగారు సాగుబడి చేస్తున్నదనే ముసలమ్మ 42 సంవత్సరాల క్రింద చచ్చిపోయింది. (Laughter)

SRI S. VEMAYYA :—ఆవిడ బంధువులు ఎవరైనా సాగుబడి చేస్తున్నారా అని నా ప్రశ్న ?

(No answer)

*State Khadi and Village Industries Board.*

710—

* 1291 Q.—SRI PRAGADA KOTAIAH :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

whether the Government propose to introduce a bill for making the State Khadi and Village Industries Board a Statutory one ?

THE HON. SRI D. SANJIVAYYA :—

The matter is under consideration.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈ విషయంలో ఇప్పటికి ఆలస్యం జరగడంవల్ల All India Khadi and Village Industries Board ఈ రాష్ట్రంలో ఈ పరిశ్రమలకోసం ఏ విధంగా తమ కార్యకలాపాలను నిర్వహిస్తున్నదో నాకు అర్థం కావడంలేదు. అందువల్ల వెంటనే మీరు State Boardను ఏర్పాటుచేసి All India Board కు, State Board కు Co-ordinated Policy ఉండేటట్లుగా ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—చేస్తాము.

*Supply of Electricity to certain villages in Hindupur and Kadiri Taluks.*

711—

*979 Q.—SRI P. VENKATARAMANAPPA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Government propose to supply Electricity to Gorantla, Chilamathur firkas in Hindupur taluk and Mohammadabad in Kadiri taluk, Anantapur District ; and

(b) if so, when it will be executed ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) and (b). A scheme for supply of electricity to Gorantla etc., villages in Gorantla firka is under formulation. Another scheme for supply to Chilamathur and Damakethepalle villages has been sanctioned by Government and it will be taken up for execution and completed during 1956-57 subject to the availability of funds The question of supply of electricity to villages in Mohammadabad firka has been investigated and a scheme will be formulated as soon as all the necessary particulars are collected from the prospective consumers.

ఎ: గోరంట్ల ఫిర్కాలో గురువారపల్లె, మాలేపల్లె, వనవోలు, గొల్లపల్లె, [illegible] గ్రామాలకు విద్యుచ్ఛక్తి supply చేయడానికి ఒక పథకం తయారు అవుతున్నది. చిలమత్తూరు, దామకేతేపల్లె గ్రామాలకు supply చేసే నిమిత్తం 1956 మార్చి 31 తేదీన 1,71,900 రూపాయలు విలువగలిగిన స్కీము ఒకటి ఆమోదింపబడింది. [illegible] ఈ పథకం అమలు [illegible]. మహమ్మదాబాద్ ఫిర్కాలో

పుల్లయ్యపల్లె, ఓబులదేవరపల్లె చెరువు, జవ్వాకుల కొత్తపల్లె, మహమ్మదాబాద్ సున్నపల్లె, గ్రామాలలో ఒక Scheme జరుగుతున్నది. ఇక Superintending Engineer గారు దానిని finalise చేసి Chief Engineer గారికి పంపించవలసి ఉంటుంది.

SRI K. V. VEMA REDDI :— అధ్యక్షా, కదిరి తాలుకాలో సుమారు 500 బావులు ఉన్నాయని మంత్రిగారికి తెలుసు. ఈ ప్రాంతంలో కూడా ఎక్కువ బావులు ఉన్నాయి. బావుల ఆసరాతో వ్యవసాయం సాగిస్తూ ఉంటారు. ఈ బావుల ఆసరా వల్ల సాగుచేసే ప్రదేశానికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—Agricultural purposes serve చేయుటకు గాను గ్రామాలకు electricity ఇవ్వాలనేది ప్రభుత్వం యొక్క ప్రధానోద్దేశ్యమని ఇదివరకు అనేక సందర్భాలలో చెప్పి ఉన్నాము. Agriculture కు ముందు ప్రాధాన్యత ఇస్తున్నాము

*Repair to the supply channel from the Chintravati river to Nagalakunta.*

713—

* 978 Q.—SRI P. VENKATARAMANAPPA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the District Collector, Anantapur has received any memorandum from the Ayacutdars of Gorantla, Anantapur District in the month of November 1955, for repairing the supply channel leading water from the Chintravati river to Nagalakunta and Ravikunta ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) The matter is receiving the attention of the Collector of Anantapur.

*Industrial Corporation.*

714—

* 459 Q.—SRI N. C. SESHADRI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :—

(a) when the proposed Industrial Corporation for Andhra begins functioning ; and

(b) the names of the Board of Directors thereof ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) The Andhra State Financial Corporation has already commenced functioning.

(b) The Government have constituted the first Board of Directors of the said Corporation with the following persons as Directors :

(1) Sri Bikkani Venkataratnam (Chairman).

(2) Sri R. Prasad, I.C.S., Secretary to Government of Andhra Industries Co-operation and Labour Department.

(3) Sri V. K. Rao, I.C.S., Secretary to Government of Andhra, Finance Department.

(4) Sri S. R. Kaiwar, I C.S., Director of Industries and Commerce, Andhra.

(5) Sri P. Suryanarayana.

(6) Sri C. A. Subrahmanyam.

(7) Sri Maddi Sudarsanam.

(8) Sri P. Parthasaradhi.

(9) Sri M. Somappa.

(10) Sri T. Sundara Raghavan, Managing Director.

Sri N. C. SESHADRI :—అధ్యక్షా, Industrial Finance Corporation కు రాష్ట్రప్రభుత్వం finance చేస్తున్నదా? ఇందులో కేంద్రప్రభుత్వాని కూడా ఏ మైనవాటా ఉన్నదా ? కేంద్రప్రభుత్వం ఎంత ఇస్తున్నది ? State Government ఎంత ఇస్తున్నది ? Loans ఇచ్చే విషయంలో ఏదైన ఒక maximum limit fix చేసినారా ? fix చేస్తే, ఎంత fix చేసినారు.

THE HON. Sri D. SANJIVAYYA :—దీనిలో State Government [illegible], Reserve Bank of India 10 లక్షలు schedule banks, [illegible] banks 10 లక్షలు, others 5 లక్షలు [illegible]

4th April 1956]

SRI B. APPA RAO :—మంత్రిగారు పేర్కొన్న సభ్యులలో కార్మికుల తాలూకు ప్రతినిధి ఎవరూ ఉన్నట్లుగా కన్పించడంలేదు. పరిశ్రమలను నభివృద్ధి పరచడంలో కార్మికుల సహకారంకూడా అవసరం. కాబట్టి వాళ్ల ప్రతినిధినికూడా ఇందులోకి తీసుకొంటారా ? తీసుకోవడం అవసరమని ప్రభుత్వం భావిస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA .—దానికి ఎవరెవరు ఉండాలి, అనేది Constitution లోనే వున్నది.

> 'Three directors nominated by the State Government, one director nominated by the Board of Directors, one director nominated by the Central Board of the Reserve Bank and three directors to be elected in the prescribed manner.'

SRI N. C. SESHADRI:-అధ్యక్షా, ఈ Finance Corporation Office ప్రస్తుతం విజయవాడలో ఉన్నది. విజయవాడలో పెట్టడానికి ప్రత్యేకమైన కారణాలు ఏమిటి ? దీనిని రాజధాని నగరములో పెడితే బాగుంటుందేమోనని నా అభిప్రాయం. దానిని గురించి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తున్నదా ?

THE HON. SRI D. SANJIVAYYA .—దానికి ప్రత్యేక కారణాలు ఏమిలేవు. విజయవాడ అన్నింటికి central place అని, industries ఎక్కువగా ఉండేటటువంటి స్థలముఅని, అక్కడ పెట్టారు.

SRI M. RAJARAM :—అధ్యక్షా, ప్రభుత్వం nominate చేసినటువంటి ముగ్గురు సభ్యులలోను కార్మికుల తరఫున ఒక్క సభ్యుడినైనా తీసుకోనందుకు ప్రభుత్వ ఆక్షేపణ ఏమిటో సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA ;—ఆక్షేపణ ఏమి లేదు. ఇప్పటికే nomination పూర్తిఅయిపోయింది. Second time nomination లో అవకాశం ఉన్నట్లయితే ఆలోచిస్తాము.

*House sites for Harijans in Nandikotkur etc., Taluks.*

715—

* 733 Q.—SRI E. AYYAPU REDDI .—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) the number of villages in which the Harijans were given pattas for house sites in Nandikotkur and Nandyal taluks of Kurnool District, and

(b) in how many more villages the land acquisition proceedings are pending in these two taluks ?

THE HON. SRI G. LATCHANNA .—

| | | |
|---|---|---|
| (a) (i) Nandikotkur Taluk | ... | 6 villages. |
| (ii) Nandyal Taluk | ... | 1 village. |
| (b) (i) Nandikotkur Taluk | ... | 20 villages. |
| (ii) Nandyal Taluk | ... | 7 villages. |

(a) నందికొట్కూరు తాలూకాలో 6 గ్రామాలు; నంద్యాల తాలుకాలో ఒక గ్రామము.

(b) నందికొట్కూరు తాలుకాలో 20 గ్రామాలు; నంద్యాల తాలుకాలో 7 గ్రామాలు.

SRI E. AYYAPU REDDI :—ఎంతకాలంనుంచి land acquisition proceedings pending లో ఉన్నాయో మంత్రిగారు సెలవిస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—ప్రశ్నలో time కోరుతూ సూచన ఏమి లేనందున report లో dates ఏమి ఇవ్వబడలేదు.

SRI S. VEMAYYA :—(b) లో 27 ఉన్నాయి అన్నారు. అందులో award stage లో ఎన్ని, initial stage లో ఎన్ని, pending గా ఉన్నాయో చెబుతారా ?

THE HON. SRI G. LATCHANNA :—District Welfare Officer గారి యొక్క enquiry stage లోని (b. కి సంబంధించిన) report వల్ల తెలుస్తుంది.

SRI E. AYYAPU REDDI :—గత రెండు, మూడు సంవత్సరాల నుంచి కూడా ఈ Land acquisition proceedings pending లో ఉన్నాయి. Land acquisition officer గ్రామాలలో అదనంగా వసూలు చేసేదానికి అవకాశం లేకుండా ఉన్నది. అందువలన వారు నేను ఒక్కడిని బస్సులలో పోవలసినటువంటి పరిస్థితులు వచ్చాయి గనుక నేను గ్రామాలకు రావడానికి వీలుఉండదు అని

complaint చేస్తూ ఉన్నారు. కాబట్టి land acquisition proceedings accelerate చేసేదానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నం చేస్తుందా?

THE HON. SRI G. LATCHANNA :—ప్రభుత్వం provide చేసి నటువంటి డబ్బుతో land acquisition for house sitesకు సంబంధించినటువంటి కార్యక్రమము అంతాకూడా గత ఏడాది చాల చురుకుగా సాగింది. ఇప్పుడు ఆగి పోయాయి అంటే, ఆ జిల్లాలకు ఇచ్చిన allotment పూర్తి అయిపోయి ఉంటుందని గౌరవసభ్యులు గమనించాలి.

SRI G. NAGESWARA RAO :—అధ్యక్షా, ఇప్పుడు నంద్యాల, నంది కొట్కూరు తాలూకాలలో మొత్తం 27 గ్రామాలు pending లో ఉన్నాయని చెప్పారు. ఈ 27 గ్రామాలలో గతంలో house sites కొరకు డబ్బు చెల్లించిన గ్రామాలు ఎన్ని సెలవిస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—ఇప్పుడున్న report లో డబ్బు చెల్లించినట్లుగా లేదు. వేరే ప్రశ్న వేస్తే ఏదైనా చెప్పడానికి అవకాశం ఉంటుంది.

SRI N. VENKAIAH :—ఈ సంవత్సరం allotment ఉన్నది కాబట్టి ఆగిపోయిన కార్యకలాపాలను మళ్ళా ఆరంభిస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—ఆగిపోవడం అనేది లేదు, అవి కొనసాగిస్తూనే ఉంటాము.

SRI N. K. LINGAM —అధ్యక్షా, Harijan Welfare Department వచ్చి 8 సంవత్సరములు కావస్తున్నది. నందికొట్కూరు తాలూకాలో ఈ 8 సంవత్సరములుగా, 20, 30 గ్రామాలలో acquisition proceedings pending లో ఉన్నవని మంత్రిగారు సెలవిచ్చారు. ఈ 8 సంవత్సరములలో 8 గ్రామాలలోకూడా పట్టాలుఇవ్వలేదు, allotment కొద్దిగాఉన్నదని చెప్పుతున్నారు. ఈ department పార్యేలోపలనైనాగాని 20 గ్రామాలలో ఇళ్ళ స్థలాలకొరకు పట్టాలు ఇస్తారా?

THE HON. SRI G. LATCHANNA :—ఇది 8 సంవత్సరములనుంచి వస్తున్న పద్ధతి. దీన్ని త్వరగా అమలుజరపడానికి ప్రయత్నం చేస్తున్నాము. ఆరు గ్రామాలలో ఈ కార్యక్రమమును గతఏడాది పూర్తిచేశాము. ఈ ఏడాది, వీలైతే, అన్నీ పూర్తి చేయాలనే ఉన్నదిగాని కొంత మిగిల్చాలి అనే ఉద్దేశంలేదు. మనకు వస్తున్న డబ్బును బట్టి పని జరుగుతూ ఉన్నది.

[4th April 1956

SRI N. SRINIVASA RAO :—ఈ Land Acquisition Act ను మార్చాలి అని ఉద్దేశించిన తరువాత కనీసం 3, 4 ప్రభుత్వాలు మారినాయి ఇక ఎన్ని ప్రభుత్వాలు మారిన తరువాత ఈ Acquisition Act మారుతుందో సెల విస్తారా?

THE HON. SRI G. LATCHNNA :—Land Acquisition Act కు, ప్రభుత్వాలు మారడానికి ఏమి సంబంధంలేదు. ప్రభుత్వాలు మారినా, జరుగవలసిన పనులు జరుగుతూనే ఉంటాయి.

SRI R. B. RAMAKRISHNA RAJU :—ఈ land acquisition proceedings చాలా సావకాశముగా జరుగుతూ ఉంటాయి. ఇటువంటి ముఖ్యమైన విషయాలలో, భూమి తీసుకోవాలన్నప్పుడు, acquisition proceedings అంతా పూర్తి అయి డబ్బు ఏర్పడిన తరువాత తీసుకొంటారా, లేక ముందుగానే భూమి తీసుకొని తరువాత acquisition proceedings ఎప్పుడు జరిగినా పరవాలేదని, అది నిదానంగా చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :— వీలైన చోట్ల, consent letters పుచ్చుకొని వ్యవహారం జరుగుతున్నది. అది లేనప్పుడు emergency rules క్రింద తొందరగా జరిపించవలసిందని instructions ఇవ్వడం జరిగింది. దానివల్ల ఈ ఏడాది, మొన్న మార్చి 31 తేదీలోగా చాలమటుకు పనులు కొనసాగించడానికి అవకాశాలు కలిగినవి.

SRI B. SANKARAIAH :—ఈ schemes ఆగిపోవడం లేదు అన్నారు ఈ సంవత్సరం grant తగ్గించేశారని రాష్ట్ర వ్యాప్తంగా హరిజనులు పెద్ద ఆందోళన చేస్తున్నారు. ఇప్పుడు award stage లోకి వచ్చిన ఒక్కొక్క జిల్లాకు 50 వేలు, 60 వేలు ఉంటె, వచ్చే సంవత్సరం 10, 15 వేలుకూడ లేవని అన్నారు. అట్లాంటప్పుడు, ఇప్పుడు award stageలోకి వచ్చినవి అన్నికూడ అట్లే నిలబడిపోయేట్లు ఉన్నాయి. ఇది చాలా ముఖ్యమైన విషయము. కాబట్టి ఈ విషయంలో ఏమి చర్య తీసుకుంటారు ?

THE HON. SRI G. LATCHANNA :—మనకు వస్తున్న ఆదాయము పెరుగుతున్న కొలది, ఎంతవరకు చేయడానికి వీలుంటుందో అంతవరకు ప్రయత్నం [illegible]

[illegible]

[illegible] LINGAM :—ప్రభుత్వము ఎక్కువ allot చేయడానికి డబ్బు [illegible]. అందుచేత, ప్రభుత్వములో డబ్బులేదు ఇప్పట్లో [illegible]

హరిజనులకు ఇళ్ల స్థలాల కొరకు అర్జీలు పంపవద్దు, అని చెప్పుతూ, ఒక notification జారీచేస్తే బాగుంటుందనుకొంటాను. ఎందుచేతనంటే, బీద హరిజనులు ప్రభుత్వము ఏదో డబ్బు ఇచ్చి ఇళ్లు కొనిస్తారని దినానికి నూర్లకొలది అర్జీలు శాసన సభ్యుల ద్వారా ప్రభుత్వానికి పంపిస్తున్నారు. కనుక అటువంటి notification ఒకటి జారీ చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—మనము ఒక programme ను విరమించుకొంటె notification అవసరముంటుందే గాని programme నడిపించే టంతకాలము, అటువంటి notification యొక్క అవసరం ఉండదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Acquisition proceedings అంతా అయిపోయి award కూడ ఇచ్చేసమయంలో డబ్బులేదనే కారణంతో అసలు మొత్తం proceedings అంతా withdraw చేయవలసిందని అంటున్నారు. దానివలన ఇదివరకువచ్చే ఇళ్ళయినాఉంటే, అవికూడ పోతున్నాయి. అందువల్ల ప్రభుత్వము sanction చేసేదానికి డబ్బులేక పోయినప్పటికి, అది ఆ ప్రజలైనా ఇచ్చుకొంటామంటున్నప్పుడు award అమలు జరుపుతారా ?

THE HON. SRI G. LATCHANNA :—Acquisition withdraw చేసే విషయంలో, డబ్బులేదనే కారణంతో withdraw చేయడమనేది జరుగలేదు. అటువంటి నోటీసు ఇదివరకుకూడ ప్రభుత్వానికి రాలేదు డబ్బు కొరతవల్ల ఎక్కువరోజులనుంచి pending లో ఉన్నవాటికి priority ఇస్తూ, ఒకటి తరువాత ఒకటి కొనసాగిస్తున్నారేగాని cancellation అనేది జరుగలేదు.

SRI PRAGADA KOTAIAH :—ఈ రాష్ట్రం మొత్తంమీద చాలా హెచ్చుగా దరఖాస్తులు వస్తున్నాయి. పూర్వము ఒకకోటి రూపాయలతో ఒక Special Fund create చేశారు. తరువాత పదిలక్షల రూపాయలు దీనికి allot చేశారు. అదే ధోరణిలో ఈ Special Fund ను ముందుకు తీసుకు పోవడానికి ఏదైనా కొంతడబ్బు allot చేసేదానికి ప్రభుత్వము పూనుకొంటుందా ?

THE HON. SRI G. LATCHANNA :—పూర్వము, ఒకకోటి రూపాయల fund అనేది permanent గా ఒక Reserve fund గా ఏర్పాటుచేసి పని చేయాలనుకొన్నారు. ఇప్పుడు ఉన్నటువంటి డైనందిన ఖర్చులుబట్టి ఏటా 54 మొదలు 56 లక్షలవరకు ఖర్చుఅయ్యేస్థితికి వచ్చింది. అందువల్ల, ఆ కోటిరూపాయల fund నుంచి కార్యక్రమము అభివృద్ధిచెందిందేగాని తగ్గలేదు. అదేవిధంగా ఈ 10 లక్షల రూపాయలుకూడ ఒక Reserve fund గా ఉంచి దానివల్ల వ్యవహారము జరుపుతుంటే బాగుంటుందనే ఆలోచనచేత మన ప్రభుత్వము 1954-55 లో ఒక

Reserve Fund ఏర్పాటుచేసింది. ఆ పదిలక్షల రూపాయలు ఒక యేడాదిలోనే ఖర్చుఅయ్యే పరిస్థితి వచ్చింది. అందువల్ల ఇప్పటి పరిస్థితులలో, ఈ current year లో ఈ house sites కు ఇంకా అదనంగా provide చేయడానికి అవకాశ మున్నదా లేదా అనే సమస్య పరిశీలనలో ఉన్నది. అది రద్దు చేయబడలేదు.

SRI. G. RAMASWAAMI REDDI :—కొన్ని గ్రామాలలో హరిజనులు అనవసరంగా house sites కు గాను applications ఇస్తున్నారు. ప్రక్క గ్రామాలలో ఇచ్చినదిచూచి ఆశపడి అనవసరంగా applications ఇస్తున్నారు. కాబట్టి, గ్రామాలలో ఈ విషయాలు విచారించి నిర్ణయిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇప్పుడు దరఖాస్తులు వచ్చిన తోడనే, acquisition ప్రారంభించే విధానము అనుసరించడంలేదు. దరఖాస్తు వచ్చినా అది అవసరమో, అనవసరమో కనుక్కొనే వ్యవహారం చేస్తారు.

SRI A. KALESWARA RAO :—విజయవాడ మునిసిపాలిటీలోనే హరిజనులకు, 252 కుటుంబాలకు, ప్రక్కనఉన్న పటమట గ్రామంలో 14 ఎకరాలభూమి 90 వేల రూపాయలకు acquire చేస్తామని 10, 12 సంవత్సరముల నుంచి వ్యవహారంజరుగుతున్నా ఇప్పుడు అది వదలిపెట్టినట్లున్నా, తరువాత ఎవరిడబ్బు వారికి తిరిగి వాపసు చేసినట్లున్నా ప్రభుత్వదృష్టిలోకి వచ్చిందా ! వచ్చిఉంటే, అది ఏ విధంగా జరిగిందో తెలవిస్తారా ?

THE HON SRI G. LATCHANNA :—ఇది నంద్యాల, నందికొట్కూరుకు సంబంధించిన ప్రశ్న అని మనవిచేస్తున్నాను.

SRI B. SANKARAIAH :—ఈ స్కీము ఇప్పుడు తీసివేయడం లేదని చెప్పారు. కాని అదనపు staff ను తీసివేయవలసిందని, ఇప్పుడువచ్చిన దరఖాస్తులు ఏ stage లో ఉంటే, ఆ stage లోనే పెట్టేస్తున్నారని చెప్పుతున్నారు. ఆచరణలో ఈ విధముగా చేయడానికిని, ఆ scheme రద్దు చేస్తాము అనే దానికిని భేదమేమి ఉంటుంది ? తరువాత ఇప్పుడు తీసుకొన్నటువంటి schemes అన్నికూడ sanction చేసేదానికి వచ్చేసంవత్సరం ఏమిచర్యలు తీసుకొంటారు ?

THE HON. SRI G. LATCHANNA :—మనకు 1955-56 లో 10 లక్షల fund ఉండినందువల్ల పనులు త్వరగా సాగించడానికిని acquisition proceedings నడిపించడానికిని special staff ను వేసినాము. ఆ fund అంతా 1955-56 లోనే ఖర్చుపెట్టాము. ఖర్చుపెట్టిన తరువాతకూడ ఆ staff ను ఉంచాలి అన్నట్లయితే ఇప్పుడు provide చేసిన డబ్బు staff కే సరిపోతుంది [illegible] కేమీ మిగలదు.

SRI G. NARASIMHA MURTY :—ఈ 8 సంవత్సరముల నుంచి, హరిజనులు ఇళ్లస్థలాలకోసం ఏర్పాటైనటువంటి ధనంలో ఇళ్లస్థలాలు కొనడానికి ఎంతసొమ్ము ఖర్చు అయిందో, ఉద్యోగస్థుల జీతాలు మొదలైనటువంటివాటికి ఎంత సొమ్ము అయిందో, ఉజ్జాయింపుగా సెలవిస్తారా ?

THE Hon. SRI G. LATCHANNA :—Notice, Sir.

SRI V. KURMAYYA :—అధ్యక్షా, హరిజనులకు ఇళ్లస్థలాలు ఇచ్చే విషయంలో, 20, 30 సంవత్సరములనుంచికూడ, మొట్టమొదట ఇది Labour Department ప్రారంభించినప్పటినుంచి, ఇళ్లస్థలాలు యిచ్చేది 10 percent కంటే దాటలేదు. Applications చాలా వస్తున్నాయి. కాని ప్రభుత్వము వద్ద డబ్బులేదు. కాబట్టి, గ్రామాలలో వారికి అసంతృప్తి కలుగజేసేదానికంటే ప్రభుత్వము ఈ house sites ఇచ్చేపద్ధతిని మానుకుంటే బాగుంటుందని అనుకొంటాను. కనుక ఈ విషయాన్ని ప్రభుత్వము ఆలోచించి ఈ పద్ధతి మానుకొంటారా ?

THE Hon. SRI G. LATCHANNA .—మానుకోవడం గౌరవ సభ్యులకు నచ్చినట్లు కనిపిస్తే, ప్రభుత్వానికి ఒక Report ఇస్తే పరిశీలిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—గత సంవత్సరం 10 లక్షల రూపాయలు ఖర్చుపెట్టినట్లు మంత్రిగారు చెప్పారు. ఆ fund లోనుంచి ఖర్చుచేసినప్పటికి, దాన్ని replenish చేస్తూ, ఆ fund అట్లాగే ఉంచాలని, అది ఎప్పుడూ ఉండేటటువంటి fund అని మంత్రిగారికి గుర్తుఉన్నదా ? ఉంటే, ఈ సంవత్సరం దానికి 10 లక్షల రూపాయలు ఎందువల్ల కేటాయించలేదు ?

THE HON. SRI G. LATCHANNA .—ఎందువల్ల కేటాయించలేదో సభ్యులకు తెలుసును.

SRI PILLALAMARRI VENKATESWARLU:—బడ్జెటుపై చర్చించింది తెలుసును. కాని ఈ విషయంగురించి ఒక ప్రత్యేక instance లో ఒక ప్రశ్నవచ్చినప్పుడు, దానికి సమాధానంచెప్పుతూ, 10 లక్షల రూపాయలు అయిపోయింది గనుక ఏమి చేయలేకపోతున్నామని అంటున్నారు. ఆ 10 లక్షల రూపాయిల fund ఒక purpose తో ఏర్పాటు చేశారు గనుక దానికి ఎందువల్ల కేటాయించలేదో మాకు తెలియదు. బడ్జెటు సందర్భములో చర్చించాము అంటే అది సరియైన సమాధానం కాదు. ఈ విషయంలో ప్రభుత్వము తమ అభిప్రాయము ఖచ్చితంగా చెప్పాలని కోరుతున్నాను.

THE HON. SRI G. LATCHANNA :—బడ్జెటులో అన్ని పద్దులను సాకల్యంగా పరిశీలించి, ప్రతి ఒక దానికి Cut motion పెట్టి చర్చించి నటువంటి సభ్యులకు ఈ ప్రశ్న అప్పుడు ఉదయించకపోవడం అంటే నాకు అర్థం కాకుండా ఉన్నది.

SRI PRAGADA KOTIAH :—అధ్యక్షా, పదిలక్షలు reserve fund క్రింద కేటాయించారు. అందులోనుంచి ఎప్పుడు ఎంత ఖర్చు పెట్టినను, ఖర్చుచేసిన సొమ్మును తిరిగి అందులో జమకట్టాలిగదా! అధికారులు ఆవిధముగా వ్యవహరించ నందుకు వారిమీద ప్రభుత్వం ఎందుకు చర్య తీసుకోలేదు?

THE HON. SRI G. LATCHANNA :—పదిలక్షలు provide చేస్తూ, 2.6 లక్షలు అదనముగా ప్రతిసంవత్సరము provide చేసే పద్ధతికూడ అవలంభిస్తూ వస్తున్నాము. ఆ విధముగా 1955-56 వ సంవత్సరముదాకా 2 6 లక్షలు అదనముగా provide చేయడము జరిగింది. ఈ సొమ్ము Harijans కు యిళ్లస్థలాల కొరకు reserve fund గా ఉన్నప్పటికిని పని జరగడములేదనే ప్రశ్న సభ్యులలోనూ ప్రజలలోనూ సహజముగా కలిగింది అందువల్ల దానినిగురించిన డబ్బుతో ఆపని పూర్తిచేయడము ప్రభుత్వముయొక్క బాధ్యతకాబట్టి, అది పూర్తిగా ఖర్చు చేశాము.

THE HON. SRI D. SANJIVAYYA:—Sir, I would like to clarify the actual position. మామూలుగా ప్రతిసంవత్సరమూకూడ రెండు లక్షలో, మూడులక్షలో యీ fund క్రింద బడ్జటులో కేటాయిస్తూ ఉంటాము. అదికాకుండా గత మంత్రివర్గములో Harijan Welfare Fund అని పదిలక్షలతో ఒక నిధిని ఏర్పాటుచేయడమయింది. అందులోనుంచి హరిజనులకొరకు డబ్బు తీసుకోవడము, అంటే వారికి స్థలాలకొఱకుగాని, యింకా యితర విషయాలకుగాని, లేకపోతే విద్యకోసమైనాసరే, అది హరిజన సంక్షేమకార్యక్రమముల క్రింద దేనికొరకైనను సరే ఖర్చుచేయటము అనేది వచ్చినప్పుడు యీ 10 లక్షల ఫండులో నుంచి తీసుకోవడము, తరువాత తీసుకున్న డబ్బు అందులో మరలవేయుడము, ఆవిధముగా ఎప్పుడూ జరగాలి అనే ఉద్దేశ్యముతో యీ fund create చేయుబడినది. అయితే గతసంవత్సరము యీ పదిలక్షలుకూడ హరిజనులకు ఇళ్లస్థలములకొరకు ప్రభుత్వానికి డబ్బు చాలా యిబ్బందిగా ఉన్నందువల్లనూ, దానికి చాలా దరఖాస్తులు రావడమువల్లనూ, ఈ పదిలక్షలుకూడ ఆ యిళ్లస్థలాలకోసమే వినియోగించాలి, అది అంతా ఖర్చుచేసి [illegible] అనే ఉద్దేశ్యముతో దానికి ప్రత్యేకముగా staffను వేసి, యీ పని జరి[illegible] నిర్ణయము జరిగింది. ఆ నిర్ణయము ప్రకారము ఆ పదిలక్షలు ఖర్చు [illegible] [illegible] యిప్పుడు [illegible]గురించి ఆలోచించుకోవలసియున్నది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, award ఇచ్చినతరువాత ప్రభుత్వానికి డబ్బు హాజరులో లేకపోయినందున స్థలముల యజమానులకు యింతవరకూ డబ్బు యివ్వలేదనే కారణముతో వారు కోర్టులకు వెళ్ళవలసి ఉంటుంది. ఇలాంటి యిబ్బందులు పడేబదులు ప్రభుత్వానికి ఎప్పుడైతే డబ్బులేదో award యిచ్చినప్పటికినీ కేసులు withdraw చేయవని కలెక్టర్లకు instructions యిచ్చారు. ఆ విధముగా యీ రోజువరకూ జరుపుతున్నారు. Award యిచ్చినట్లు నా నోటీసుకు రాలేదని మంత్రిగారు అంటున్నారు. ఆ విధముగా withdraw చేసినవి నాకు తెలిసినంతవరకు ఎనిమిది కేసులున్నవి. అందువల్ల డబ్బులేదనే కారణముచేత కేసులు withdraw చేసేబదులు award mature అయియున్నదని, వారు స్వయముగానే పెట్టుకుంటారేమోనని అడిగినవాళ్లకే యిస్తారేమో అడిగి, వారికే యిస్తే బాగుంటుందేమో, దానిని విచారించి ఆ విధముగా చేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇలాంటి కేసులు సభ్యులకు తెలిసి ఉంటే, వాటిని ఇదివరకే ప్రభుత్వముయొక్క నోటీసుకు వచ్చియున్నట్లయితే, యిప్పటికి ఆ విషయములో కొంత పరిశీలన జరిగి ఉండేది.

*Institute for manufacture of Veterinary preventive medicine.*

717—

*1064 Q.—SRI N C. SESHADRI —Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) whether there is an institute in Andhra for manufacture of Veterinary preventive medicine ,

(b) if not, how the needs of this State are met ; and

(c) the value of medicines purchased by this Department for use in this State for Veterinary purposes from outside for the year ending 1954-55 ?

THE HON. SRI K. OBULA REDDI —

(a) No, Sir The Government have started recently a Laboratory at Guntur for manufacture of vaccine for combating Ranikhet disease in poultry.

(b) The needs of the State are met by purchasing the various medicines and vaccines from the Indian Veterinary Research Institute, Izatnagar, Uttar Pradesh, the Institute

of Veterinary Preventive Medicine, Ranipet, and the Pasteur Institute, Coonoor

(c) Rs. 9,296-2-6.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, మంత్రిగారి సమాధానాన్నిబట్టి మధ్యప్రదేశ్ నుంచి, ఇంకా యితర రాష్ట్రాలనుంచి, రాణీపేటనుంచి ప్రతిసంవత్సరము కూడా కోళ్లకు కుక్కురజబ్బు రాకుండా preventive medicine ప్రభుత్వము తెప్పించడము జరుగుతున్నది. ఇదిగాక మన రాష్ట్రములో black waters disease అనేది రావటమువల్ల పశువులు చాలామటుకు చచ్చిపోతున్నవి. కాబట్టి యీ medicine యితర రాష్ట్రములనుంచి తెప్పించుకునేబదులు మన రాష్ట్రములోనే యీ preventive medicine తయారుచేయటానికి ఒక Institute open చేయించటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI K. OBULA REDDI :—ప్రస్తుతం గుంటూరులోనే కోళ్లకువచ్చే కుక్కురజబ్బునుగురించి పరిశోధన చేయటానికి ఏర్పాటుచేశారు. దానిని prevent చేయటానికి vaccine కూడ తయారు అవుతున్నది. ఈ vaccine ఉపయోగముగా ఉన్నందువల్ల, యీ జబ్బు చాలాభాగము నివారణ అవుతున్నది. ఇక పశువులకు జబ్బునుగురించి ఆలోచించవలసియున్నది.

## SHORT NOTICE STARRED QUESTIONS.

### *Names of Members of the Delimitation Commission.*

699-A—.

S. N. Q. No. 1366—A. Q.—SRI PILLALAMARRI VENKATESWARLU :—Will the Hon. the Chief Minister be pleased to state :

the names of Members of the Delimitation Commission.

THE HON. DR. B. GOPALA REDDI :—

The Delimitation Commission, India, constituted by the Central Government under the provisions of the Delimitation Commission Act, 1952 has ceased to function with effect from [illegible] 1955. The residuary work of the Commission is being attended to by the Election Commission, India.

4th April 1956]

It is assisted by the following five Associate Members nominated under the Delimitation Commission Act

(1) Sri T. Viswanatha Reddy, M.P.
(2) Sri Kadiyala Gopala Rao, M.P.
(3) Sri Lanka Sundaram, M.P.
(4) Sri T. N. Venkatasubba Reddy, M.L.A.
(5) Sri N. Chendhurama Naidu, M.L.A.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇదివరకు యీ Delimitation Committee లో Leader of the Opposition కూడ ఒక మెంబరుగా ఉండేవాడు. అలాంటప్పుడు యీ కమిటీలో Leader of the Opposition ను మెంబరుగా ఎందుకు చేర్చలేదో చెబుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇదివరకు ఉన్న Delimitation Committee లో Opposition తరఫున Leader అయిన నాగిరెడ్డిగారు, యింకొకరు గంగయ్య నాయుడుగారు, వీరు యిద్దరు ఉండేవారు. వారు యీ సారి ఎన్నిక కాబడనందున వారు యిందులో లేరు. అందువల్ల వారు కమిటీ మెంబర్లుగా cease అయినారు. తక్కిన విషయమును గురించి ఆలోచిస్తే, Act యొక్క 42 వ సెక్షను ప్రకారము కమిటీలో అయిదుగురు మెంబర్లే చాలు, అంతకంటె ఎక్కువ మంది అక్కరలేదని Election Commission వారు నిర్ణయించినట్లు వున్నది. ఈ విషయములో Election Commission వారు శాసన సభాధ్యక్షుని మెంబర్లను నామినేటు చేయమని కోరవలసియున్నది. కమిషన్‌వారు కోరకుండా శాసన సభాధ్యక్షుడు నామినేటు చేయటానికి వీలులేదు అందువల్ల యిప్పుడు ఉన్న మెంబర్ల సంఖ్యయే చాలునని కమిషనువారు ఉద్దేశించి వుండవచ్చు. Sec. 42 (1) ప్రకారము అయిదుగురు ఉండాలని వున్నది. అందువల్ల అయిదుగురు కంటె ఎక్కువ అవసరములేదని ఊరకున్నారు కాబోలు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ బిల్లు యింకా act కాలేదు. Act అయిన తరువాతనే Sec. 42 (1) operation లోకి వస్తుంది. కాని క్రిందటిసారి యీ కమిటీ సమావేశము అయింది. ఆ నాడు యీ కమిటీలో Leader of the Opposition కూడ ఉండాలని Speaker గారు recommend చేశారు. కాబట్టి మరల ఈ కమిటీలో Leader of the Opposition అయినా ఉండేటట్లుగా ప్రభుత్వము సూచిస్తుందా ?

[4th April 1956

THE HON. Dr. B GOPALA REDDI :—ఇదివరకు జగరవలసిన Delimitation work యిప్పుడు అయిపోయింది. ఇప్పుడు యింక ఏమీ లేదు. మొన్న హరిజనుల విషయము వచ్చినప్పుడు పదియవ తేదీన తిరుపతిలో సమావేశ మయ్యారు. ఇంకా యీ work ఉంటే, Election Commission వారే ఆలోచించి, Speaker గారిని పలుగురు మెంబర్లను నామినేటు చేయండి అని కోర వచ్చు. అప్పుడు వారు నామినేటు చేయవచ్చును. అంతేకాని యీ లోపుగా ప్రభుత్వము చేయగలిగింది యేమీ లేదనుకుంటాను.

MR SPEAKER :—Mr. Sankaraiah wants a debate on the subject raised in Question No 715. Let there be a general question raised and I shall consider it. His request is to allow a debate on the grant of house sites to Harijans in Nandikotkur and Nandyal taluks. So I am disallowing it.

[Note :—An asterisk * at the commencement of a speech denotes revision by the Member].

## II POINT OF INFORMATION re .

*Strike in the King George Hospital, Visakhapatnam.*

SRI G. YELLAMANDA REDDI :—On a point of information, Sir. నిన్నటి దినము నేను రెండు Adjournment Motions ను యిచ్చాను. అందులో ఒకటి విశాఖపట్టణమును గురించి Chief Minister గారు ఒక Statement యిస్తామన్నారు. వాటి సంగతి యేమి అయిందో తెలియలేదు.

MR. SPEAKER :—దానిని 5వ తేదీకి వాయిదా వేసినట్లు నాకు జ్ఞాపకము.

THE HON. Dr. B. GOPALA REDDI :—Statement ను 5వ తేదీన ఇస్తానండి.

## III ADJOURNMENT MOTION re :

*Collection of overdue instalments in Nandigama village.*

SRI PILLALAMARRI VENKATESWARLU :—There is one adjournment motion of mine about collections in Nandigama village.

MR. SPEAKER :—You admit that those two instalments are overdue.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Loans ను తిరిగి రెండు వాయిదాలలో చెల్లించవలెనని ఉన్నది.

MR. SPEAKER :—You admit that both the instalments are overdue. What is wrong with the Government in collecting overdue instalments ?

SRI PILLALAMARRI VENKATESWARLU :—"Both the instalments are overdue" అనేది కాదండి. నేను యిచ్చిన Adjournment Motion ను చదువమంటే చదువుతాను వినండి.

"వ్యవసాయక అప్పులు నందిగామ తాలూకాలో వసూలు చేసేసందర్భములో అధికారులు రెండుదఫాలుగా వసూలుచేయవలసిన అప్పును ఒకేతడవకట్టవలెనని నిర్బంధముగా వసూలుచేయుటకు పూనుకొనుటయేగాక జప్తులుచేస్తూ ప్రజలను నానా అగచాట్లకు గురిచేసి, తీవ్రమైన ఆందోళన పరిస్థితులు కల్పించినందులకు సభను వాయిదావేసి, యీ సమస్యను చర్చించవలెను" అని.

MR. SPEAKER :—On that I have written, 'Please ascertain from the Member whether the two instalments sought to be collected by coercive process have fallen due.' That is my querry. Your answer is, 'Yes'. If the two instalments have fallen overdue what is wrong in Government collecting them ? So I have disallowed the motion.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడు వచ్చిన చిక్కు రెండు instalments న్నూ వసూలు అయినవా అనికాదు. రెండు instalments లో కట్టుతారా అని అడిగారు. సరే రెండు instalments లో కడతామని సమాధానము చెప్పారు. యిది చాలా ముఖ్యమైన విషయము. ప్రభుత్వం యిచ్చిన ఆర్డరుప్రకారము రెండు instalments లో కట్టించుకుంటున్నారు. మొదట ఒక instalment కట్టవలసిఉన్నది. తరువాత ప్రభుతముయొక్క ఆర్డరులో (interruption)

SRI L. LAKSHMANA DAS :—On a point of order, Sir, సభ్యులు ఎవరైనా ఒక adjournment motion యిచ్చినప్పుడు, దానిని Speaker గారు disallow చేశానని చెప్పినప్పుడు, ఆ Motion ఒకసారి disallow అయిపోయిన తరువాత, motion యిచ్చిన సభ్యుడు తిరిగి దానిని గురించి మాట్లాడడమునకు వీలు అవుతుందా ?

MR. SPEAKER :—It should not be done.

## IV POINT OF INFORMATION re :

### *Talks between Andhra and Hyderabad Ministers regarding formation of Visalandhra*

SRI K. V. VEMA REDDI .—Sir, I rise on a point of information. The House is very anxious to know about the outcome of the deliberations of the meeting of the Chief Minister of Andhra and the Chief Minister of Hyderabad on the question of the change in the nomenclature of Andhra-Telangana, the location of the Andhra High Court and the question which has now arisen whether this Andhra-Telangana is a new State in the light of the definition of the clause under new State in para 1 of the Bill. The House is very anxious to know about the result of the deliberations. If they are to be kept secret I do not press it.

THE HON. DR. B. GOPALA REDDI:—ఈ దినం S. R. Bill నె general discussion అయిపోతుంది. నా reply లో ఏదైనా చెప్పవలసి ఉంటే చెబుతాను. గవర్నమెంటు తరఫున ఈ S R. Bill మీద ఒక official motion కూడా ప్రవేశపెట్టబడుతుంది. ఈ ఎసెంబ్లీవారు ఈ అభిప్రాయానికి వస్తున్నారు, ఈ సిఫార్సులు చేస్తున్నారు అని ఒక official motion పెట్టడం జరుగుతుంది. దానికి కావాలంటే amendments పెట్టుకోవచ్చును General discussion అయిన తరువాత నేను wind up చేసేటప్పుడు వివరాలన్నీ చెబితే బాగుంటుందని అనుకుంటున్నాను.

MR. SPEAKER .—To-day and tomorrow we are discussing this Bill. I mean the general discussion will take place. Because I have got nearly twenty members more to speak, it is my desire to call the Leader of the House to-morrow for reply.

THE HON. DR. B. GOPALA REDDI :—వెంకటేశ్వర్లుగారికికూడ [illegible] సాయంకాలంపూట సమావేశం అయ్యేటందుకు అభ్యంతరం [illegible] Purchase Tax Bill ను సాయంకాలం చర్చించడానికి అభ్యంతరం [illegible].

Sri Pragada Kotaiah] [4th April 1956

కూడ మించి ఉండదు. బహుశా చిత్తూరు జిల్లాలో కొన్ని లక్షలమంది, శ్రీకాకుళం జిల్లాలో కొన్ని వేలమంది ఉన్నట్లున్నారు. మనరాష్ట్రంలో ఇతర భాషాప్రాంత ములవారు అంతకుమించి ఉండరు. రాయలసీమలో కొన్ని వేలమంది కన్నడులు ఉన్నారేమో? కాని ఇరుగు పొరుగు రాష్ట్రాలలో మన తెలుగువారు లక్షల సంఖ్యలో ఉన్నారనే విషయమును మనం ఈనాడు జాగ్రత్తగా ఆలోచించవలసి యున్నది. బళ్ళారి ప్రాంతములోన, చెంగల్పట్టు జిల్లాలోను, గంజాము, కోరాపుట్టి జిల్లాల లోను, మధ్య ప్రదేశ్‌లోను, మైసూరులోని కోలారు ప్రాంతంలోనుకూడ బహుశా 1,050 లక్షలు పైగానే మన తెలుగు ప్రజలు ఉన్నారనే విషయమును గుర్తుకు తెచ్చు కొన్నట్లయితే ఈనాడు మనం సాధించిన విశాలాంధ్ర మనం కావాలని చెప్పి కోరుతున్న విశాలాంధ్ర మాత్రం సిద్ధించలేదని స్పష్టంగా బోధపడుతుంది. ఆ విషయంలో మన ఆంధ్ర నాయకులు ఉదారతను చూపించినా ఉదాసీనతను కన బరచినా పొరపాటే అవుతుంది. మన నాయకులు చాలా ఉదారతను ప్రదర్శించడం వల్లనయినా, లేక ఉదాసీనతను ప్రదర్శించడంవల్లనైనా మనకు ఆ ప్రాంతాలు రాకపోయి ఉండవచ్చును. పండిట్ జవహర్లాల్ నెహ్రూగారు అనేక సందర్భ ములలో policy statements చేస్తూ చాలా స్పష్టంగా చెప్పినారు. ఏదైనా రెండు రాష్ట్రముల మధ్య adjustment వ్యవహారము వచ్చినప్పుడు ఆ రెండు రాష్ట్రములు అంగీకరించినప్పుడే నిర్ణయం చేయడం సాధ్యమవుతుంది. లేకపోతే సాధ్యంకాదని చెప్పినారు. అటువంటప్పుడు మన బళ్ళారిని తీసుకుపోయి అవతల వారికి అంటకట్టడమనేది మన రాష్ట్రము, మైసూరు రాష్ట్రము అంగీకరించితే జరిగి ఉండాలి, లేదా మనమాటను వినకుండానైనా చేసి ఉండాలి. మనమాటను విన కుండా చేసినట్లయితే వారు policy statement కు విరుద్ధమైన విధానమును అవలంబించినారని చెప్పక తప్పదు. ఇది చాలా చిన్న విషయం. ఏదో విధంగా జరిగిపోతుంది. విశాలాంధ్ర రావడంతోటి అణగి ఊరుకుంటుంది. మళ్ళీ తిరిగి లేకెత్తదు అని అనుకోవటం చాలా పొరపాటు. మొత్తంమీద చూసినట్లయితే కొంత అశాంతి ఏర్పడేటటువంటి ప్రమాదం ఉన్నది. బళ్లారి ప్రాంతమును, మైసూరు లోని కోలారు, గంజాము, కోరాపుట్టి, బరంపురం, చెంగల్పట్టు సేలం జిల్లాలకు సంబంధించిన విషయంలో మనం గట్టి ప్రయత్నం చేయాలి. అందుకు మన ప్రభుత్వం గట్టిగా పట్టుదలతో పూనుకోనట్లయితే అక్కడ ప్రజా ఉద్యమములు ఏర్పడే అవ కాశాలున్నాయేమోనని నేను ప్రభుత్వంయొక్క దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఈ విషయాలను మనం జాగ్రత్తగా పరిశీలనచేసి మన తెలుగువారినందరినీ మన [illegible] రాష్ట్రంలో చేర్చుకొనుటకు గట్టి ప్రయత్నం చేయవలసిన ఆవశ్యకత [illegible]

4th April 1956] [Sri Pragada Kotaiah

Zonal Councils ను కేంద్ర ప్రభుత్వంవారు సదుద్దేశ్యంతోనే ఏర్పరచి ఉండవచ్చును. ఇరుగు పొరుగు రాష్ట్రములలోనున్న సమస్యలను కేంద్ర ప్రభుత్వ ప్రమేయం లేకుండా పరిష్కరించుకొనుటకు ఏర్పాటుచేసి ఉండవచ్చును. కాని నిన్న మదరాసు శాసన సభలో ఈ Zonal Councils ను వ్యతిరేకించిన కమ్యూనిష్టు సోదరులకు సభా నాయకుడు చెప్పినట్టి సమాధానమును వినిన తరువాత ఆ Zonal Councils వల్ల నష్టము సంభవించే అవకాశములు ఉన్నాయేమో ననిపిస్తున్నది. దానిని మనం జాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం ఉన్నది ఆంధ్రదేశం నడి బొడ్డులో ప్రవహిస్తున్నటువంటి కృష్ణా, గోదావరి మున్నగు జీవనదులు ఆంధ్రుల ఒకరి సొత్తు మాత్రమే కాదు. మనం అందరంకూడ అనుభవించుటకు అవకాశం ఉంది. ఆ అవకాశమును సమకూర్చుకొనుటకే యీ Zonal Councils సహాయపడతాయని నెహ్రూగారు స్పష్టంగా చెప్పారు. దీనిని బట్టి చూస్తే ఆంధ్ర దేశమునకుగాని, ఇతర ప్రాంతములకుగాని లేనిపోని చిక్కులు కలిగే అవకాశము లున్నాయేమో జాగ్రత్తగా పరిశీలన చేయవలసిన అవసరం ఉన్నదని నేను ప్రభుత్వమునకు మనవి చేయుచున్నాను. ఎప్పుడైనా వివిధ రాష్ట్రముల మధ్య భేదాభిప్రాయములు వచ్చినపుడు వాటిని పరిష్కరించుటకు కేంద్ర ప్రభుత్వానికి అధికారం ఉన్నది. అలాంటప్పుడు వీటికి సలహా సంఘములను నిర్ణయించేసి లేనిపోని చిచ్చులు కలతలు తెచ్చి పెట్టుకొనుటకంటే భేదాభిప్రాయములు కలిగినపుడు కేంద్ర ప్రభుత్వమే పరిష్కరించే నిధానమును అవలంభిస్తేనే బాగుంటుందేమో దానిని గురించి ఆలోచించ మని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

Regional Committees అనేది చాలా ప్రమాదకరమైన విషయం. తెలంగాణా ప్రాంతం బాగా వెనుకబడిన ప్రాంతం. కనుక వారికి రక్షణ లొసగుటకొరకు మన ఆంధ్ర నాయకులు ఈ Regional Committees ను ఏర్పాటు చేస్తున్నా రనుకొంటాను. కాని ఈవేళ తెలంగాణా ప్రాంతము ఒక్కటే వెనుకబడి ఉన్నది అంటే అంగీకరించడం సాధ్యం కాదు. ఆంధ్ర రాష్ట్రంలోకూడ రాయలసీమ లాంటి ప్రదేశమంతా కూడ వెనుకబడి వున్నది. డెల్టా ప్రాంతము విశేషముగా ఉన్నదని చెప్పుకొనే గుంటూరు జిల్లాలో పల్నాడు, వినుకొండ, సత్తెనపల్లి, ఒంగోలు తాలూకా మున్నగునవన్నీ కూడా చాలా వెనుకబడిన ప్రాంతములే. ఈ నాడు విశాలాంధ్రలోని ఒక్క తెలంగాణా ప్రాంతమునకు మాత్రమే అన్ని సౌకర్య ములు కలుగజేయుటకు ఈ Regional Committees ఏర్పాటును గురించి ఆలోచించే బదులు మొత్తం రాష్ట్రంలో ఏయే ప్రాంతములు వెనుకబడి ఉన్నవి? వాటిని అభివృద్ధి చేయుటకు తీసుకొనవలసిన చర్యలు ఏమిటి? అని ఆలోచించి

Sri Pragada Kotaiah] [4th April 1956

నట్లయితే బాగుంటుంది. అంతే కాని మొత్తం రాష్ట్రంలోని తెలంగాణాకు ప్రత్యేకంగా సౌకర్యములు కలుగజేస్తూ మిగిలిన వెనుకబడిన ప్రాంతములను నిర్లక్ష్యం చేయుట సముచితం కాదని మనవి చేయుచున్నాను.

Constitutionalలో provide చేసినదాన్ని బట్టి చూస్తే దానికి ఇవ్వబోయే అధికారాలు చాలా విస్తృతంగా ఉన్నాయి. చివరకు విశాలాంధ్ర పేరుతో రెండు Budgets నైనా పెట్టవలసిందని ఆదేశిస్తూ President ఉత్తర్వులు చేసినా చేయవచ్చు.

"The President may by order made with respect to the Andhra-Telangana and the Punjab provide for the constitution and functions of the regional committee and the Legislative Assembly of the State for the modifications to be made in the rules of the State Government and in the rules of procedure of the Legislative Assembly of the State and for any special responsibility of the Governor in order to secure the proper functioning of the regional committees"

దీనిప్రకారం ప్రభుత్వంయొక్క వ్యవహారాన్ని మార్పుచేయడానికి అవసరమైన ఉత్తర్వులు చేయవచ్చు. Legislative Assembly విధానాన్ని మార్చుచేయడానికి అవసరమైనటువంటి ఉత్తర్వులుకూడా చేయవచ్చు. ఆ Committee function చేయడానికి, ఆ ప్రాంతాలు అభివృద్ధి కావడానికిగాను అవసరమైనటువంటి చర్యలు తీసుకోవడంకుగాను ప్రత్యేకమైన అధికారాలను గవర్నరుగారికి ఇచ్చినా ఇవ్వవచ్చు. ఇది ఇదమిద్ధమని చెప్పడానికికూడా అవకాశంలేదు. ఈ పరిస్థితులలో Regional Committee ల వల్ల ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు ఎంతవరకు సమంగా న్యాయం జరుగుతుందనే విషయాన్నికూడా మనం జాగ్రత్తగా చూడాలి. వెనకపడినటువంటి ప్రాంతాలకు ప్రత్యేకమైన ప్రాతినిధ్యం కల్పించాలన్నా, ప్రత్యేకమైనటువంటి సౌకర్యాలను కల్పించాలన్నా అది ప్రత్యేకంగా తెలంగాణాకు మాత్రమే పరిమితం [illegible]కావడానికి అవకాశంలేదు. ఆంధ్రలో ఉన్నటువంటి వెనుకపడిన ఇతరప్రాంతాలకు [illegible]కూడా ప్రత్యేకమైనటువంటి ప్రాతినిధ్యం, ప్రత్యేకమైన వసతులు కల్పించవలసిన [illegible]అవసరం ఉన్నది. వెనుకపడినటువంటి ప్రాంతాలను ఒక రకంగాను, అభివృద్ధిచెందిన ప్రాంతాలను ఒక రకంగాను చూడవలసిన అవసరము ఉన్నది. అంతేకాని, [illegible] మాత్రం ప్రత్యేకమైనటువంటి వసతులు కల్పించవలసిన అవసరము [illegible] లేను మనవిచేస్తున్నాను

High Court విషయంలో ప్రత్యేకంగా గుంటూరులో ఒక Bench పెట్టాలనే వాదం సరైనటువంటిదని కొంతమంది Lawyers చెపుతున్నారు. హైదరాబాద్‌లో లేకుండా ఉన్నదున్నట్లుగా ఉంచదలచుకుంటే గుంటూరులోనే High Court ను ఉంచండి. అంతేగాని గుంటూరులో ఒక చిన్న Bench మిగతా High Court Hyderabad లోను ఉండాలనే వాదం సరియైనది కాదు ఈ సందర్భంలో సుబ్బారెడ్డిగారు చెప్పినటువంటి అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను ఆంధ్రదేశంలోని Lawyers అంతావస్తే తమ ఫైలు పడిపోతుందని Hyderabad లోని Lawyers అంతా భయపడుతున్నట్లుగా ఉన్నది. కాని వారుకూడా తగినంతకృషి చేస్తే ఆకృషిలో రాణించడానికి, అభివృద్ధి చెందడానికి అవకాశాలు ఉంటాయి High Court ను Hyderabad లో నైనా పెట్టాలి లేదా ఉన్నదున్నట్లుగా గుంటూరులోనైనా ఉంచాలి. అంతేగాని ఏది కానివిధంగా చేయడం మంచిది కాదేమో ఆలోచించవలసిందని చెబుతున్నాను ఇక రాజధాని పేరు విషయం తీసుకుంటే, ఆంధ్ర తెలంగాణఅనేది చాలా విచిత్రమైనటువంటి పేరు. ఇది ఎలా వచ్చిందో తెలియదు. గాని దీనిని మొత్తంమీద ఇద్దరిని సంతృప్తి పరచడానికిగాను పెట్టినటువంటిపేరుగా కన్పిస్తున్నది. మనం కావాలని తెలంగాణా వారిని కోరి తెచ్చుకున్నాం. కాబట్టి వారిని ఒడిలో చేర్చుకొన్న తరువాత వారేదో మలమూత్రాలు విసర్జించారని వెనకకు నెట్టితే ప్రయోజనంలేదు. కావాలని మనం కోరినందుకుగాను ఆంధ్రను మానివేసి తెలంగాణా అనిపేరు పెట్టడం మంచిది. కాబట్టి ఈ పేరు విషయంలో అందరికీ అనుకూలంగా ఉండేటటువంటి పేరైనా ఆలోచించాలి, లేదా అన్నివిషయాలలో త్యాగం చేయడానికి సిద్ధపడినట్లే ఆంధ్ర నాయకులు, ఆంధ్రప్రజలు పేరువిషయంలోకూడా త్యాగం చేయడానికి సిద్ధపడి వారికి కావలసిన తెలంగాణా అనేపేరు పెట్టడంలో ఎవరికి ఎలాంటి అభ్యంతరం ఉండవలసిన అవసరంలేదు. పేరువిషయంలో తెలంగాణా ప్రాంతంవారుగాని ఆంధ్ర ప్రాంతం వారుగాని త్యాగం చేయవలసిఉన్నదని నేను మనవిచేస్తున్నాను. ప్రస్తుతం ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క గవర్నరు ఉన్నాడు. అవసరమైతే 2, 3 రాష్ట్రాలకుకలిపి ఒకే గవర్నరును నియమించాలనే విషయం గురించి Constitution లో ఒక Amendment ను తీసుకురావాలని అనుకుంటున్నారు. ఇది సరైనటువంటి ఆలోచన కాదు. కొందరు మిత్రులు చెప్పినట్లుగా బహుభాషా రాష్ట్రాలను రూపొందించడానికిగాను నూతన విధానాన్ని భారతప్రభుత్వం అవలంబిస్తుందనే సందేహానికి ఇది తావుఇస్తున్నది. ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రములో వేరు

Sri Pragada Kotaiah] [4th April 1956

వేరుగా ప్రత్యేకగవర్నరును ఏర్పరచవలసిన అవసరంఉన్నది ఆంధ్రదేశంలో Services విషయంలో చాలకష్టాలు నష్టవస్తున్నాయనే ఆందోళన బైలుదేరుతున్నది.

ఆంధ్రదేశంలో ఉన్నటువంటి Services లో ఇలాంటి కష్టనష్టాలు రాకుండా చూచేదానికి అవసరమైన కట్టుదిట్టాలు చేయవలసిందని నేను ప్రత్యేకంగా మనవి చేస్తున్నాను. ఎన్నికల విషయంలోకూడా కొంత చిక్కుఉన్నట్లుగానే కన్పిస్తుంది, 1957 సంవత్సరంలో Hyderabad లో ఎన్నికలుజరిపి, మనకు ఆంధ్రలో ఎన్నికలను 1961 వరకు పొడిగించేదానికంటే, దేశం మొత్తంమీద 1957 లో ఎన్నికలు జరిపించడంగాని లేక వారి ఎన్నికలను 1961 వరకు పొడిగించి వారిని మనలో కలపడం అవసరమనేటటువంటి విషయాన్ని పరిశీలనచేసి మన ప్రభుత్వం తగినటువంటి సిఫార్సులను చెయవలసిన అవసరం ఉన్నదని మనవిచేస్తూ సెలవుతీసుకుంటున్నాను.

*SRIMATHI B. RUKMINIDEVI :—అధ్యక్షా, భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణవాంఛ ఏనాటినుండియో ప్రజలలో ప్రబలిఉన్నది. నానాటికి ప్రజలలో గాఢతరమవుతున్న భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణవాంఛను కేంద్ర ప్రభుత్వం గుర్తించి ప్రజాభిమతాను సారముగా ఫజలాలీ కమిషన్‌ను ఏర్పాటు చేయుట, ఆ కమిషన్ తన నివేదికను ప్రకటించడంకూడా జరిగినది. కమిషన్ ప్రకటించిన నివేదికను కేంద్రప్రభుత్వం సాకల్యంగా పరిశీలించి గడ్డుసమస్యలాగా నిలబడిన విశాలాంధ్ర సమస్యను, పంజాబు సమస్యను వదలి తక్కిన భాషాప్రయుక్త రాష్ట్రాలను ప్రకటించడం జరిగింది. ఈ ప్రకటనలో బొంబాయి సమస్యకూడా ప్రకటించిఉన్నారు. ఈ ప్రకటనపై బొంబాయి రాష్ట్రంలో జరిగిన విషాద సంఘటనలు చాలా విచారకరమైనవి. ఈ సంఘటనలపై వ్యాఖ్యానించుచు శ్రీయుత రాజగోపాలాచారిగారివంటి పెద్దలుకూడా ఇప్పటికైనను భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణాన్ని వాయిదావేయుట మంచిదని ప్రకటించిఉన్నారు కాని ప్రజాభిమతం ప్రకారంనడిచే మన కేంద్రప్రభుత్వం ఆ విధంగా చేయలేదు. విశాలాంధ్ర సమస్యను పరిష్కరించుటకు ఆంధ్ర తెలంగాణా ప్రజలమధ్యగల అభిప్రాయ భేదాలను పరిష్కరించుటకు ఆంధ్ర తెలంగాణా నాయకులు సుదీర్ఘమైన చర్చలుజరిపి విశాలాంధ్ర సమస్యను పరిష్కరించాలి. [illegible] వ తేదీన నిజామాబాద్‌లో జరిగిన భారతసేవక సమాజ్ మహాసభలో శ్రీ నెహ్రూగారు ఆంధ్ర తెలంగాణా విలీనీకరణ పద్ధతులను ప్రభుత్వం అంగీకరించినట్లు ప్రకటించి మరొక్కటి ఆంధ్రుల వాక్యానికి పాత్రులైనారు. ఆంధ్రుల రాజకీయ సాంస్కృతిక సాంఘికచరిత్ర [illegible] చాలా ప్రాచీనమైనది. [illegible] ఏకచ్ఛత్రాధిపత్యంగా

4th April 1956] [Srimathi B. Rukmini Devi

శత్రుభయంకరంగా తెలుగు దేశమును పరిపాలించిన ఆంధ్రమహిళామణి, వీరవనిత కాకతీయవంశజూరాలు రుద్రమదేవి పరిపాలనా కాలములో ఆంధ్రదేశమును సందర్శించిన ఇటలీ యాత్రికుడు మార్కొపోలో వ్రాసిన గ్రంధంలోని విషయాలను పరిశీలించినను, రెండవ పులకేశి కాలములో ఆంధ్రదేశమును దర్శించిన హ్యూయాన్ సాంగ్, పాహియాన్ వ్రాసిన విషయాలను పరిశీలించినట్లయితే ఆంధ్రచరిత్ర ఎంతటి ఉన్నతదశలో ఉన్నదో తెలుసుకోవచ్చు.

కాని, ఇటువంటి ఉన్నత స్థితిలోనున్న ఈ సామ్రాజ్యము నానాటికి క్షీణ దశనొంది వివిధ భాగాలైనవి. ఆంగ్లేయుల పరిపాలనలో ఈ వివిధ భాగాల స్వరూప స్వభావాలే మారిపోయినవి. కాని నేటికి మన వృద్ధనాయకులు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు, మన ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రిగారి నిరంతర కృషి వలన, ఈ వివిధ భాగాలు ఏకరాష్ట్రంగా ఏర్పడనున్నవి అమరజీవి, పూజ్యులు శ్రీ పొట్టి శ్రీరాములుగారి సంపూర్ణ ఆహుతి మూలాన ఆంధ్రరాష్ట్రము ఏర్పడి రేపు అక్టోబరు మొదటి తేదీకి మూడు సంవత్సరాలు నిండుతుంది. మూడు సంవత్సరాల అనంతరం ఈ అక్టోబరు మొదటితేదికి విశాలాంధ్ర రాష్ట్రము ఏర్పడనుండుట చాలా సంతోషకరమైన విషయము. ముక్కోటి ఆంధ్రుల వాంఛితార్థ సిద్ధి అగు ఈ శుభ సమయంలో ఈ ఆంధ్ర రాష్ట్రానికి "ఆంధ్ర తెలంగాణా" అనే నామము ఉండుట అంత బాగుండదేమో అనుకోవలసియున్నది. ఈ "ఆంధ్ర తెలంగాణా" అనే నామము వలన, ఆంధ్ర, తెలంగాణా ప్రజలయొక్క భేదాభిప్రాయలు అట్లే శాశ్వతంగా ఉండిపోయి రాష్ట్ర అభివృద్ధి కుంటుపడుట తటస్థించునేమో అని తలంచవలసియున్నది. అందువల్ల ఈ నూతన రాష్ట్రమునకు 'ఆంధ్ర తెలంగాణ' అనే నామము పెట్టేదానికంటె, 'ఆంధ్ర ప్రదేశ్' అను నామము పెట్టినట్లయితే, రాష్ట్రాభివృద్ధి సత్వరంగా సక్రమంగా జరుగగలదని ఆశించవచ్చును. "ఆంధ్ర ప్రదేశ్" అను నామము సర్వజనాంగీకారమై తెలంగాణా నాయకుల అభిమానాన్ని చూరగొనగలదనియు నమ్ముచున్నాను. విశాలాంధ్ర రాష్ట్రము ఏర్పడనున్నది గాని పరిసర రాష్ట్రాలలో ఉన్న ఆంధ్ర ప్రాంతాలు ఆంధ్ర రాష్ట్రములో చేరబడకుండుట చాల విచారకరము. ఒరిస్సాలో ఉన్న, పర్లాకిమిడి, బర్హంపురము, గంజాము కోరాపుట్టి, ఛత్రపురము, గుణపురము మొదలగు ప్రాంతాలైతేనేమి, మైసూరులో ఉన్నటువంటి కోలారు, పావగడ ప్రాంతాలైతేనేమి, మద్రాసులో ఉన్నటువంటి హోసూరు, క్రిష్ణగిరి మొదలగు ప్రాంతాలైతేనేమి మన ఆంధ్ర రాష్ట్రములో చేర్చకుండుట చాలా విచారకరము. ఈ విషయంలో మన కోర్కెలను తెలుపుకొన్నాను, అచ్చటి ఆంధ్రులు ఆంధ్ర రాష్ట్రములో చేరుటకు తగినంత శ్రద్ధ వహించుటంలేదని మన కోర్కెలను నిరాశ

Srimathi B. Rukmini Devi] [4th April 1956

రించుట జరుగుతున్నది. కాని ఆంధ్ర సార్వభౌములు శ్రీ కృష్ణదేవరాయల సామ్రాజ్యానికి మూలకందమైన బళ్ళారి ప్రాంతములోని బళ్ళారి ఆంధ్రులు జరుపుతున్న నిరంతరాందోళన గుర్తించియా, లేక పరిపాలనా సౌలభ్యముకొరకా, లేక భాషా సౌలభ్యం కొరకా ఈ బళ్ళారి ప్రాంతాన్ని మైసూరు ప్రాంతములో చేర్చడం జరిగినది? కాని తెలుగు సార్వభౌముల ముఖ్య పట్టణమై తెలుగు ప్రజల majority గల ఈ బళ్ళారి ప్రాంతపు ఆంధ్రులు 'మమ్మలను ఆంధ్రలో చేర్చండి' అని నిరంతర ఆందోళన సాగించుచున్న బళ్ళారి ఆంధ్రుల కనీసపు కోరికనైనా తీర్చుట కేంద్ర ప్రభుత్వము యొక్క ధర్మముకాదా? బళ్ళారినుండి శాసన సభ్యులుగా ఎన్నికైన శ్రీ ముండ్లూరు గంగప్పగారు తమ శాసనసభ్యత్వమునకు రాజీనామా ఇచ్చి, ఆ స్థానమునకు ఆంధ్ర కర్నాటక సమస్యపై by-election జరిపి, ఆ ఎన్నిక ఫలితాన్ని ప్రజాభిప్రాయంగా గుర్తించి బళ్ళారి సమస్యను పరిష్కరించవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని, మైసూరు ప్రభుత్వాన్ని కోరి ఉన్నారు. ఈ విషయాన్ని గుర్తించి కేంద్ర ప్రభుత్వంవారు తమ నిర్ణయాన్ని పునరాలోచించి, బళ్ళారి ఆంధ్రులకు ఆ కనీసపు న్యాయాన్ని అయినా దయచేయగలరని వారిని ప్రార్థిస్తున్నాను. పరిసర రాష్ట్రాలలో గల మన ఆంధ్ర ప్రాంతాల సమస్యలను పరిష్కరించుటకుగాను సరిహద్దు సంఘాలను సాధ్యమైనంత త్వరలో ఏర్పాటుచేసి ఆంధ్రులకు న్యాయాన్ని ఒనగూర్చగలరని కేంద్ర ప్రభుత్వాన్ని ప్రార్థించుచున్నాను.

తరువాత, మండల సంఘాలు ఏర్పడనున్నవి. ఈ మండల సంఘములో ఆంధ్ర రాష్ట్రానికి సంబంధంలేని కొన్ని రాష్ట్రాలుకూడ ఉన్నాయి. ఆంధ్ర రాష్ట్రానికి సంబంధం ఉన్న రాష్ట్రాలన్నీ ఉంటే, రాష్ట్రముల మధ్య ఉన్న క్లిష్ట పరిస్థితులను సులభముగా పరిష్కరించుకోవచ్చును. సరిహద్దులలో నివసించే మావంటి వారి కష్టసుఖాలను విచారించుటకు ఈ మండల సంఘాలు చాలా తోడ్పడును. రాష్ట్రాల అభివృద్ధికిగాను విద్యుచ్ఛక్తి, Irrigation అభివృద్ధి ప్రణాళికలు వేసుకొని సులభముగా రాష్ట్రాల అభివృద్ధి సాగించుకొనుటకు ఈ మండల సంఘాలు చాలా అవసరము. అభివృద్ధి పథకాలను ఏర్పరచి రాష్ట్రాల అభివృద్ధికై కృషి సలుపుటకు ఈ మండల సంఘంలో Planning Commissioner కూడ సభ్యుడుగా ఉండుట మంచిది.

[illegible] పంజాబు, ఆంధ్ర తెలంగాణా రాష్ట్రాలకు Regional Councils ను [illegible] ఉన్నారు. ఈ Regional Councils ఈ రెండు రాష్ట్రాలలోనే [illegible] చాలా ఆశ్చర్యంగా ఉన్నది. పంజాబులో గల [illegible] అభిప్రాయ భేదాలను, కలతలను పరిష్కరించుటకు

గాను పంజాబులోను ఆంధ్ర-తెలంగాణా ప్రజల మధ్య భయ నిర్మూలనకుగాను ఆంధ్రలోను ఏర్పరచినట్లు తెలియుచున్నది. అవసరమున్నంత కాలము, ఈ సంఘాలు పనిచేయుట మంచిది. కాని సంఘాలు రాష్ట్ర ప్రభుత్వ అధీనంలో ఉండుటకంటే కేంద్ర ప్రభుత్వ అధీనంలో ఉండుట మంచిది.

తరువాత మా మడకశిర తాలూకా గురించి, ఒకటి, రెండు మాటలు చెప్పవలసియున్నది. స్వార్థపరులు స్వలాభపరులు అయిన ఒక రిద్దరు ఈ మడకశిర తాలూకాను కర్నాటకుల ప్రాంతములో చేర్చుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నాలు చేసి ఉన్నారు. నిన్నను పెద్దలు శ్రీయుత కల్లూరు సుబ్బారావుగారు నుడివినట్లు అటువంటి స్వార్థపరులకు ఆనాడు ఎన్నికలలో ప్రజలు తగినంత బుద్ధి గరిపి స్వార్థపరులు తమ స్వలాభమునకై జరుపు కుట్రలకు అవకాశము ఇవ్వకుండునట్లు ప్రజలు చేసి ఉన్నారు. ఈ తాలూకా విషయంలో తగినంత శ్రద్ధ వహించి ఈ తాలూకాను ఆంధ్ర రాష్ట్రములోనే ఉంచుటకు కృషిసల్పిన మన ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారికి, ఉపముఖ్య మంత్రి శ్రీ సంజీవరెడ్డిగారికిని, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారికిని మా తాలూకా ప్రజల కృతజ్ఞతను తెలుపుచూ నా ధన్యవాదాలు అర్పించుచున్నాను.

అక్టోబరు మొదటి తేదీకి నూతన ఆంధ్ర రాష్ట్రము ఏర్పడనున్నది. నవభారత వర్షములో ఈ నూతన ఆంధ్ర రాష్ట్రము రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక రంగాలలో నూతన శకము ఆరంభించునట్లు చేయగలరని మన ఆంధ్ర నాయకులను కోరుతూ ఈ అవకాశమిచ్చినందుకు అధ్యక్షులవారికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—మహాశయా, ఈ బిల్లుమీద అంతవిశేషంగా చర్చచేయవలసిన అవసరంలేదని నా అభిప్రాయము ఈ సభలో ఈ బిల్లుకు సంబంధించి భేదాభిప్రాయాలు అంతగా ఉన్నట్లు కన్పడడంలేదు. చిరకాలవాంఛితమైన 'ఆంధ్రరాష్ట్రము వచ్చింది. ఇది ఇంకా చాలా పెద్దది అవుతున్నది. పూర్వము ఆంధ్రచరిత్రలో మనయొక్క తేజస్సు మనయొక్క చరిత్ర చాలా ఉన్నది. దానికి ఏవిధమైనటువంటి లోటులేకుండా మనము వర్తించవలెనని అనేకమందిసభ్యులు సెలవిచ్చారు. ఇది వింటూవుంటే ఒకవిధంగా నాకు కొంచెము నవ్వుకూడ వస్తుందని చెప్పకతప్పదు. పూర్వము మన ఆంధ్రచరిత్రలో మనయొక్క విశేషమేమిటి, ఇప్పుడు మనము ఏమిచేయబోతున్నాము, ముందు కృష్ణదేవరాయల వారు చేసినట్లు రాయచూరుపై ముట్టడిచేయబోతామా, కటకంమీద దండెత్తి పోతామా, లేకుంటే దక్షిణదేశంమీద దాడి తేబోతామా అనేది కొంత యోచించవలసియున్నది. ముందు ఇవన్నీ చేశారంటే అప్పుడు ఇతరరాష్ట్రాలను- ఇతర

Sri R. B. Ramakrishna Raju] [4th April 1956

రాజ్యాలనుకొట్టి వారి సంపద అంతా తీసుకువచ్చి మన ఆంధ్రరాష్ట్రములో పెట్టుకొని సంతోషంగా మన రాష్ట్రాన్ని చక్కగా జరిపినారు. ఇప్పుడు మనము ఆప్రకారంగా చేయబోతున్నామా, మనము ఏమిచేస్తున్నాము అనేది మొదట తెలిస్తే, ఇది చాలా సంతోషకరమైనటువంటి విషయమా లేక చాలా జాగ్రత్తగా చేయవలసినటువంటి విషయమా అనేది తెలుసుకోవచ్చు.

మన ముఖ్యమంత్రిగారు మనరాష్ట్రము యిప్పుడు చాలా deficit లో ఉన్నదని, దానిని సరిచేసుకోటానికి పన్నులువేసుకోవలసియున్నదని పదేపదే చెప్పుతున్నారు. మనము చూస్తున్నదానినిబట్టి, మనదేశాన్ని మనము చక్కపరచుకోవాలంటే, మనము ఎంతో కష్టపడవలసియున్నది. విశేషముగా పన్నులు ప్రభుత్వము వేస్తున్నది. మనరాష్ట్రములో సర్కారు అనిగాని, ceded districts అనిగాని ఏమీ భేదములేకుండా చూచుకున్నప్పటికిని, మనదేశము అంతాగూడ చాలామటుకు వెనుకబడేయున్నది. పెద్దపెద్ద పట్టణములని పేరుగాంచిన బెజవాడ గాని, రాజమండ్రిగాని, తెనాలిగాని, తదితరపట్టణములు ఏవి అయినప్పటికినీ అన్నీ గూడ ఏస్థితిలో ఉన్నవో మనము చూస్తూనే ఉన్నాము. వాటి నన్నింటిని మనము ఇంకను వృద్ధిచేసుకోవలసియున్నది మనదేశమంతటాగూడ ఉండే ప్రజలు ఎంతో వృద్ధికిరావలసియున్నది. ఇటువంటిసమయములో యిప్పుడు చూస్తూచూస్తూ, మనకంటే తక్కువదశలో ఉన్నవారిని మనలోకి తెచ్చుకుంటున్నాము. దీనినిబట్టి మనమీద ఎంతభారము వేసుకుంటున్నామో మనము స్పష్టముగా తెలుసుకోవలసియున్నది. కొబట్టి యికముందు అయినా, అంటే యితరరాష్ట్రాలమీద దండెత్తబోవడముకాకుండా, మనమీద భారము ఎంతో మనము వేసుకుంటున్నాము. మనము వృద్ధికిరావలసింది అటుఉంచి, మనకంటే హీనస్థితిలో ఉన్న సోదరులనుకూడ మనలో కలుపుకొని మనతోబాటు వారినికూడ వృద్ధిలోకి తీసుకునిరావటానికి మనము ఇంకను ఎంతో త్యాగముచేయవలసి ఉంటుంది అంతేకాని మనమేదో పొరుగురాష్ట్రములో ఉన్నవారిమీద బ్రహ్మాండముగా దండెత్తి, వారి సంపదనంతా కొల్లగొట్టి తీసుకొని పోతున్నామని అభిప్రాయము తెలంగాణావారిలో ఉన్నట్లు తెలుస్తున్నదిగాని, అటువంటి అభిప్రాయము యిక్కడ మనకెవ్వరికినీ లేదు ప్రత్యక్షముగా మనము చూస్తున్నవిషయమే యిది. కొబట్టి దీనికి తగిన సన్నాహముతో, తగిన మనోభిప్రాయముతో ఆ రాష్ట్రాన్ని మనము కలుపుకుని ఏమైనా ప్రయత్నము చేయవలసిందేకాని, [illegible] మాత్రము నేను మనవిచేస్తున్నాను.

[illegible] పేరుని పేరు పెట్ట దలచుకున్నారు కి [illegible] ఆంధ్ర తెలం [illegible] ఆంధ్ర [illegible] అంటున్నామో [illegible]

తెలంగాణా" అనే పేరును ఎవరూ కూడ మనలో ఒప్పుకొనలేదని స్పష్టముగా తెలుస్తున్నది. "ఆంధ్ర" అంటేనే చాలును. కొత్తగావచ్చిన సోదరులుకూడా "ఆంధ్ర" అంటూఉంటే, దీనికి వేరే ఏమి అర్థమవుతుంది? వారుకూడ చేరినారు కనుక "చేరినారు" అనే యీ కలయికను సూచించేది, ఏదైనా ఒకపేరు ఉండాలి మందరము ఒకచోట చేరినప్పుడు ఆంధ్ర ప్రదేశ్ అని పేరుపెట్టితే బాగావుంటుందని మనలో కొంతమంది అనుకున్నాము. ఈ పేరు బాగానే ఉంది కాబట్టి, తెలంగాణా వారుకూడ ఒప్పుకుంటారని అనుకుంటాను. "ఆంధ్ర ప్రదేశ్" అనే పేరు పెట్టే విషయములో యిక్కడ ఎవ్వరికీకూడా ఎట్టి ఆక్షేపణ ఉండదు కాబట్టి, దీనిని గురించి యింకను వేరే చర్చించవలసిన అవసరము లేదు. ఇక పోతే హైకోర్టు విషయము ఉన్నది, ఇది చాలా ముఖ్యమైన విషయము. మా బోటి వారు అందరు Advocates ము కాబట్టి హైకోర్టు అంటే, దానియొక్క హోదా ఏమిటో, మాకు తెలుసు. మద్రాసు హైకోర్టులో సుమారు నలభై సంవత్సరాలుగా practice చేస్తూవచ్చాము. దానికి ఎటువంటి హోదా ఉంటుందో అది అంతాగూడా మాకు పూర్తిగా తెలుసును. ఒక రాష్ట్రానికి ఒకే హైకోర్టు ఉండడము అవసరము, మంచిదిగూడా. రాజధాని ఎక్కడ అయితే ఉంటుందో, అక్కడే హైకోర్టు గూడా ఉంటే, ఆ రాజధానికి, హైకోర్టుకు సరియైన ఉన్నత హోదా కలుగుతుందని, అట్లాగే ఉంటే మంచిదని అందరియొక్క అభిప్రాయము. ఇప్పుడు మన హైకోర్టు రాజధాని నగరములో ఉన్నప్పటికినీ, దానికి వేరే Bench ఒకటి గుంటూరులో పెట్టాలని సూచన వస్తున్నది. ఆ విధముగా Bench ఒకటి వేరే పెట్టేటట్లయితే, యీ Bench కి ఎంత గౌరవ ప్రతిష్టలు ఉంటాయో గూడ ఆలోచించవలసి యుంటుంది. హైకోర్టు అంటే దానికి ఉండే హోదా వేరు, Bench కి ఉండే హోదా వేరు, ఈ Bench అనే దానికి సాధారణముగా, మేము కోర్టులలో practice చేసే వారము గనుక, ఒక మునసబు కోర్టు మాదిరి అవుతుంది. ఇక ఆ Bench కి పేరు ప్రతిష్టలు ఉన్నత స్థాయిలో ఉండవు. ప్రజలు ఆ విధముగా భావించరు. ప్రజల దృష్టిలో అదేదో మునసబు కోర్టు మాదిరి అని, హైకోర్టు వేరే అనే అభిప్రాయము తప్పకుండా కలుగుతుంది. ఇటువంటి అభిప్రాయము యీ Bench విషయములో కలుగజేయడము అవాంఛనీయము. కాబట్టి ఒకే హైకోర్టుఉండాలి, అదిగూడ రాజధాని నగరములోనేవుండాలి. అలాగున ఉంటే, దానిఅంతస్తు వేరుగా వుంటుంది. ఇదిగాక మరొక ముఖ్యమైన విషయము చెప్పదలచాను ఇటీవలనే నేను Chief Justice గారితో మాట్లాడేటప్పుడు వారు చెప్పింది, ప్రస్తుతము గుంటూరులో వున్న పని పూర్తి కావాలంటే, కనీసము పదిమంది జడ్జీలు అయినా ఉంటేనేగాని,

Sri K. B. Ramakrishna Raju] [4th April 1956

సాధ్యపడేటట్లు కనబడలేదని అన్నారు. ప్రస్తుతం హైకోర్టులో ఉండేపని శీఘ్రంగాను, సక్రమంగానూ పూర్తిచేయాలంటే పదిమందిజడ్జీలు అయినా ఉండాలి అని అన్నారు. లేకపోతే సాధ్యముకాదు అని అన్నారు. ఆప్రకారము ఇప్పుడు మనకు 11 జిల్లాలకు 10 మంది కావలసివస్తే, యిప్పుడు మరొక తొమ్మిదిజిల్లాలు తెలంగాణావి ఈ రాష్ట్రానికి చేరబోతున్నవికదా! అలాంటప్పుడు మరొక పది మంది జడ్జీలకు పని ఉంటున్నదన్న మాట మీరు, వారు, అందరుచేరి 20 మంది కావలసి ఉంటుందన్నమాట. వేరువేరే పెట్టితే 20 మంది కావాలి. ఒకేచోట ఉంటే ఇంతమంది అవసరము ఉండదు. Composite Madras High Court క్రింద 25 జిల్లాలు ఉన్నప్పుడు అక్కడ ఎంతమంది జడ్జీలు ఉంటూవచ్చారో చూడండి. కాబట్టి నాకు తోచే అభిప్రాయము యేమిటంటే, రెండు benches పెట్టినట్లయితే జడ్జీలు చాలామంది అవసరమవుతారు. ఒకే bench పెట్టేటట్లయితే హైకోర్టు పని అంతా, అన్ని జిల్లాలకు చేరి, యే పది పన్నెండు మందితోనో పూర్తి చేసుకోటానికి వీలవుతుంది కాని రెండు benches పెట్టేటట్లయితే ఇక్కడ చేసినంతపని అక్కడ మరల చేయాలి. ఇది duplication of work క్రిందకు వస్తుంది. పైగా జడ్జిలసంఖ్య జాస్తిచేయవలసి ఉంటుంది. ఈ విషయములో మన తెలంగాణా సోదరులకు నేను చెప్పదలచింది యేమిటంటే, ఆంధ్రరాష్ట్రము ఏర్పడేటప్పుడు ceded districts ఆంధ్రలో చేరడములేదా అనే ప్రశ్నవచ్చింది. ఇలాంటి special course కు ఎప్పుడూకూడా నేను ఆమోదించినవాణ్ణి కాను. Ceded districts ఐదు జిల్లాలు అయితే సర్కారు జిల్లాలు ఆరుఉన్నవి. వారు మాత్రము అంత జాస్తి యేమి, మేము మాత్రము అంత తక్కువ యేమి అనే అభిప్రాయముతో, మనము అడిగో, లేక నిర్బంధముచేసో అడిగిఉండేవాళ్లము. గాని వారికి మనయొక్క శక్తిసామర్థ్యములు ప్రదర్శించి ఏదైనా చేసుకోవలసిందే గాని, యాచిస్తే మనకు పని ఎప్పుడూ కాదని అనుకున్నాము. అలాంటి అభిప్రాయములోని వాడను కాదు నేను. కాబట్టి ఆ ప్రకారముగానే తెలంగాణావారిని మనము చేర్చుకున్నట్లయితే ఎప్పుడుకూడ వారియొక్క నిజమైనకోరికలకుగాని వారికి కావలసిన సౌకర్యాలకుగాని "కాదు" అని చెప్పటానికి మనలో ఎవ్వరికీగూడ మనస్సురాదు. ఎప్పుడూ కూడ మనయొక్క శక్తిసామర్థ్యముల మీద మనము ఆధారపడిఉండాలి గాని చట్టములో పెట్టిన safeguards మీద ఆధారపడడము వివేకవంతము కాదు. సమంజసము [illegible]. కాబట్టి హైకోర్టు హైదరాబాదుకువస్తే అక్కడ హైదరాబాదు [illegible] profession కు దెబ్బ తగులుతుందని, వారియొక్క సంపాదన [illegible] మీద వేరేకాంచి గుంటూరులోనే పెట్టు

కోండి అని వారు మనకు చెప్పడము మంచిదికాదు. ఎవరికి శక్తిసామర్థ్యాలు ఉంటే వారే పైకివస్తారు ఎవరికి ఉన్నశక్తి వారికి ఉండనే ఉంటుంది. కాబట్టి గుంటూరులో వేరే bench లేకుండా హైకోర్టును ఒకేచోటులో హైదరాబాదుకు కదిలించడమే ఉత్తమమైన మార్గము.

ఇకపోతే మన నూతనరాష్ట్రానికి Legislative Council పెట్టాలని సూచన ఉన్నది. Composite Madras State లో ఉండగా నేను ఆరు సంవత్సరములు కవున్సిలుకు చేర్మనుగా ఉన్నాను. అక్కడ నాకు ఉన్న అనుభవముతో మాట్లాడుతున్నాను నేను చేర్మనుగా ఉన్నది 1944నుంచి 1950 వరకూ కవున్సిలులో ఉండే మెంబర్లు ఎసెంబ్లీ వారు ఎన్నుకునేవారుగా ఉంటారు. ఈ ఎన్నుకునేవారుకూడా ఆ సమయములో ప్రభుత్వములో ఏ పార్టీ మెజారిటీలో ఉంటుందో, వారి పార్టీలోనివారినే ఎన్నుకోవడమవుతుంది. అంటే ప్రభుత్వమునకు అనుకూలముగా ఉండేవారే వస్తారు. కొంతమందిని nominate గూడా చేస్తారు. ఇక వారు గవర్నమెంటుకు ఎప్పుడూ అనుకూలురే. మద్రాసులో ఎట్లా జరుగుతూ వచ్చిందంటే, ఏ బిల్లు అయినాసరే, అది మంచిదిగాని, చెడ్డదిగాని, ప్రభుత్వము తెచ్చిన బిల్లు ఏదైనా సరే, ఎసెంబ్లీలో ప్యాసు అయినది, మరల యిక్కడ కవున్సిలులో వారితరపున మెంబర్లేకాబట్టి యిక్కడగూడ తప్పక ప్యాసుకావడమే అవుతూ వచ్చింది. ఏదివచ్చినా నిరాఘాటముగా ప్యాసు అవుతుంది కవున్సిలు ఉండాలా లేదా అంటే, అది ప్రభుత్వముయొక్క పార్టీతరపున ఉన్న మెంబర్లేగనుక అప్పుడు కవున్సిలు ఉండవలసిందే వద్దు అని నేను అనను. దానికి ఏ ఆక్షేపణలేదు. అయితే కౌన్సిలులో ఏ బిల్లు అయినా ప్యాసుచేయడము అనేది వచ్చేసరికి, కౌన్సిలువారు చెప్పేకారణములు ప్రభుత్వమువారు ఒప్పుకుంటేనే అది ప్రయోజనపడుతుందిగాని, ఎసెంబ్లీలో కూర్చునే మంత్రులే మరల ఆ బిల్లు విషయములో అక్కడ కౌన్సిలులోగూడ వచ్చి కూర్చుని మంత్రిగారు బిల్లును కౌన్సిలులో Introduce చేసి ఎసెంబ్లీలో ప్యాసు చేయించుకున్నట్లు, యిక్కడ ప్రభుత్వము పార్టీవారు ఏర్పాటుచేసిన మెంబర్లేగనుక, ఏ ఆక్షేపణలేకుండా అక్కడ కౌన్సిలులో కూడ ప్యాసుచేయించుకోవడము, యాక్టుచేయించుకోవడము అవుతుంది. ఎసెంబ్లీ ప్యాసుచేసిన బిల్లు, కౌన్సిలులో ప్యాసుకావాలని పెట్టుకున్నాము గనుక, రెండు చోట్లలోనూ ప్రభుత్వానికి మెజారిటీవుంటుంది. గనుక easy గా Pass అయిపోతుంది కౌన్సిలులో నుంచి అనుభవజ్ఞులు, వయోవృద్ధులు, రాజకీయాలలో మంచి ప్రవేశముగలవారుగాను ఉంటారు. ఇటువంటి వారి చేతులలో బిల్లు పెట్టితే, వారు వారికి తోచిన సలహాలుయిస్తే, అది ప్రభుత్వానికి సమ్మతపడకపోతే, బిల్లు ప్యాసుకావడము కష్టము. కౌన్సిలులోని

Sri R. B. Ramakrishna Raju] [4th April 1956

వారు నిష్పక్షపాతముగా ఉద్రేకములేకుండా చాలామటుకు విమర్శింపగల శక్తిగల వారు ఉంటారు. అయితే ఏమి ప్రయోజనం? ఇక్కడ ఎసెంబ్లీలోఉన్న మెజారిటీ పార్టీ ప్రభుత్వముయొక్క పార్టీగనుక మంత్రులు ఆ పార్టీకి ఏమి చెబితే అది కొనసాగినట్లేగదా. ఇక్కడ కౌన్సిలులో అనుభవముగలవారు కనుక "ఇది యిట్లాకాదు, అట్లా" అని చెబితే అది ప్రభుత్వానికి నచ్చకపోవచ్చు. అప్పుడు ప్రభుత్వం బిల్లును తీసుకుని రావటానికి యిష్టపడకపోవచ్చు. అప్పుడు చిక్కుసమస్య ఏర్పడుతుంది. అది లాభము లేదు. నేను చేర్మనుగాఉన్న ఆరు సంవత్సరాలలోను చూచాను మంత్రులు ఎవరువచ్చినా అంతా ఒకే పార్టీపాలసీకి చెందినవారు వారందరూకూడా "తాను పట్టినకుందేలుకు మూడే కాళ్లు అని అంటారు" అది ఎసెంబ్లీవాళ్లు ఒప్పుకోవాలి. కౌన్సిలులోని వాళ్లుకూడ ఒప్పుకుని తీరాలి. లేదండి నాలుగు కాళ్లండి అని కౌన్సిలువారుఅంటే అది నచ్చదు. వాళ్లు చెప్పినది నెగ్గితీరవలసిందేనని మంత్రులు అంటారు. ఇది నా అనుభవవాక్యం. ఇలాంటి instances యింకా అనేకము చెప్పగలను. కౌన్సిలువాళ్లు చెప్పినట్లు చేయక పోతే, యిక యీ కవున్సిలు ఎందుకు? ఏ బిల్లుఅయినా కవున్సిలులో చర్చ జరిగి నప్పుడు, కవున్సిలువారు ఏదైనా amendments propose చేస్తే "అది పరేనండి. దాని సంగతి ఆలోచించి తరువాత వేరే బిల్లు తెస్తాము, amendments చేస్తాము, అవి తరువాత చూస్తాము, యిప్పుడు మాత్రము యీ బిల్లు ప్యాసు కానివ్వండి అనిచెప్పడం, బిల్లు ప్యాసుచేయించుకుపోవడం, వెళ్లడం జరుగుతూ ఉండేది. ఇదేమాదిరిగా బిల్లు మంత్రులు చెప్పినట్లుగా కవున్సిలు మెంబర్లు విని ప్యాసుచేయవలసివచ్చేది. మెంబర్లుచేసే సూచనలు అంగీకరించపోతే, యిక యీ మెంబర్లు, యీ కవున్సిలుయొక్క ప్రయోజనము యేమిటి? ఎప్పుడు ఏ amendment propose చేసినా, అవి ముట్టుకోకుండా ప్రస్తుతానికి యీ బిల్లు కానివ్వండి అని చెప్పి ప్యాసు, చేయిస్తారు. లేకపోతే దానికి వేరె బిల్లు తెస్తామని అంటారు. ఇక అది అంతటితోసరి. మరల బైటికిరాదు అదేవిధముగా Inams Bill తెస్తామని యీ ప్రభుత్వము చెబుతూ వస్తూన్నది. దాని సంగతి యింతవరకు బైటికి రాలేదు. అలాగే Rent Reduction Act తెచ్చారు ఈ Rent Reduction Act విషయములోగూడ Inams Bill మాదిరిగా తకరారు జరుగుతూనే ఉన్నది. ఏకో Amendments తెస్తామని అన్నారు. చెప్పడమేగాని, ఆ Amendments వచ్చేదిలేదు, మేము చూడబోయేదిలేదు. ఇవి, అవి రానేరావు. కాబట్టి ఎసెంబ్లీ మాదిరికాకుండా, కవున్సిలుకు స్వేచ్ఛ యివ్వాలి అంటున్నాను. ఎసెంబ్లీ, కవున్సిలు రెండూగూడ ప్రతిబింబములుగా ఉంటే ఏమీ ప్రయోజనము [illegible] నేను అనుకున్నది యేమిటంటే, క్రిందటిసారి నూతన Election [illegible]

4th April 1956] [Sri R. B. Ramakrishna Raju

వచ్చినప్పుడు, 1952 తరువాత యీ ప్రకారము direct elections లేవు. కాబట్టి, ఏదో కవున్సిలులో కొంతవరకు భేదము ఉండవచ్చు ననుకున్నాను. అక్కడకూడ భేదము ఉండటానికి సావకాశము లేకుండా పోయింది. ఇందుకు కారణము ఏమిటంటే, మెంబర్ల యొక్క, కౌన్సిలుయొక్క ఆయుర్దాయము అంతా ప్రభుత్వము చేతులలో ఉన్నది వారు యిష్టపడితే, కౌన్సిలు ఉంచడము లేకపోతే, యీ కౌన్సిలు మాకు అక్కర లేదు అని ఒక Resolution pass చేసి ఎత్తివేయించటానికి సిద్ధపడడము జరుగుతుంది కాబట్టి ప్రభుత్వము తెచ్చిన బిల్లులు ఏవిఅయినాసరే, అవి మంచివి కాని, చెడ్డవి కాని, ప్యాసు చేయవలసిందే, కాదు అని చెప్పటానికి వీలులేదు, అనే మాదిరిగా కాకుండా కౌన్సిలుకు Indepence యివ్వాలి, లేకపోతే కౌన్సిలువుండి ప్రయోజనము లేదు. ఏ నాడు అయితే కౌన్సిలు ప్రభుత్వానికి వ్యతిరేకముగా బిల్లును ప్యాసు చేస్తుందో, ప్రభుత్వము మాట నెగ్గడము లేదని ఎత్తి వేయించటానికి చూస్తారు. ప్రభుత్వము ఎట్లా చెబితే అట్లా వినవలసివచ్చేదానికి, యీ కౌన్సిలు యెందుకు? కాబట్టి కౌన్సిలు ఉండాలి అని ప్రభుత్వానికి నిజంగాఉంటే, దానికి రాష్ట్రములో మంచి అనుభజ్ఞులు ఏ Subject అయినా బాగా తెలిసినవారు ఉంటే మంచిది. వారు వారికిఉన్న అనుభవములనుబట్టి మంచి సలహాలుయిస్తారు. ప్రభుత్వం ఆ ప్రకారము చేయదలిస్తే, కౌన్సిలు పెట్టండి. లేకపోతే, అది వద్దు. కాని కౌన్సిలు ఉండాలి అనేవాలో నేను ఒకణ్ణిగాని దానికి స్వేచ్ఛ యివ్వకపోతే, ప్రయోజనము లేదు ఇప్పుడు American Constitution లో గూడ, అక్కడ Senates లోగాని, House of Representatives లోగాని, ఏ బిల్లు అయినా రెండు సభలలోను ప్యాసు అయితేనే, అది President assent కు పోతుంది. లేకపోతే, ఆ బిల్లు వెనుకకు తిరుగవలసింది కాని మనకు అట్లాకాదు. ఎసెంబ్లీలో ప్యాసు చేసిన బిల్లు కౌన్సిలుకు పంపిస్తారు. అది కౌన్సిలులో ప్యాసు చేయకుండా తిరిగి Assembly కు Remit చేస్తే, మరల రెండవసారి పంపుతారు. అప్పటికి ప్యాసు చేయక తిప్పి పంపివేస్తే, అది తిరిగి మూడవసారి పంపిస్తారు. మూడవసారిగూడ కౌన్సిలు ప్యాసు చేయకుండా త్రిప్పివేస్తే, అప్పుడు ప్రభుత్వం ఎర్ర సిరాతో ఒక గీటు పెట్టి, మేము చెప్పిందే ఘనవాక్యం, మేముచేసిందే Law, అని వ్యాప్తగా చేయించుకుంటారు. అటువంటి దానికి యీ కౌన్సిలు ఎందుకు? కాబట్టి కౌన్సిలు ఉండవలెనంటే దానికి స్వేచ్ఛమాత్రము ఉండాలి. ఇప్పుడు సాధారణముగా ఎసెంబ్లీలో జరిగేచర్చ వేరు, కౌన్సిలులో జరిగేచర్చ వేరు. కౌన్సిలు వారు చెప్పింది ప్రభుత్వం వినాలి. వినకపోతే ప్రయోజనములేదు. కాబట్టి యిక ముందు రాబోయే ఏ మంత్రులు అయినా సరే, కౌన్సిలు మనకు ఉండాలి అని అంటు

Sri R. B. Ramakrishna Raju] [4th April 1956

వారు నిష్పక్షపాతముగా ఉద్రేకములేకుండా చాలామటుకు విమర్శింపగల శక్తిగల వారు ఉంటారు. అయితే ఏమి ప్రయోజనం? ఇక్కడ ఎసెంబ్లీలో ఉన్న మెజారిటీ పార్టీ ప్రభుత్వముయొక్క పార్టీ గనుక మంత్రులు ఆ పార్టీకి ఏమి చెబితే అది కొనసాగినట్లేగదా. ఇక్కడ కౌన్సిలులో అనుభవముగలవారు కనుక "ఇది యిట్లా కాదు, అట్లా" అని చెబితే అది ప్రభుత్వానికి నచ్చకపోవచ్చు. అప్పుడు ప్రభుత్వం బిల్లును తీసుకుని రావటానికి యిష్టపడకపోవచ్చు. అప్పుడు చిక్కు సమస్య ఏర్పడుతుంది. అది లాభము లేదు. నేను చేర్మనుగా ఉన్న ఆరు సంవత్సరాలలోను చూచాను మంత్రులు ఎవరువచ్చినా అంతా ఒకే పార్టీ పాలసీకి చెందినవారు వారందరూ కూడా "తాను పట్టినకుందేలుకు మూడేకాళ్లు అని అంటారు" అది ఎసెంబ్లీవాళ్లు ఒప్పుకోవాలి. కౌన్సిలులోని వాళ్లుకూడ ఒప్పుకుని తీరాలి. లేదండి నాలుగు కాళ్లండి అని కౌన్సిలువారుఅంటే అది నచ్చదు. వాళ్లు చెప్పినది నెగ్గితీరవలసిందేనని మంత్రులు అంటారు. ఇది నా అనుభవవాక్యం. ఇలాంటి instances యింకా అనేకము చెప్పగలను. కౌన్సిలువాళ్లు చెప్పినట్లు చేయకపోతే, యిక యీ కవున్సిలు ఎందుకు? ఏ బిల్లుఅయినా కవున్సిలులో చర్చ జరిగినప్పుడు, కవున్సిలువారు ఏదైనా amendments propose చేస్తే "అది సరేనండి. దాని సంగతి ఆలోచించి తరువాత వేరే బిల్లు తెస్తాము, amendments చేస్తాము, అవి తరువాత చూస్తాము, యిప్పుడు మాత్రము యీ బిల్లు ప్యాసు కానివ్వండి అనిచెప్పడం, బిల్లు ప్యాసుచేయించుకోవడం, వెళ్లడం జరుగుతూ ఉంటేది. ఇదేమాదిరిగా బిల్లు మంత్రులు చెప్పినట్లుగా కవున్సిలు మెంబర్లు విని ప్యాసుచేయవలసివచ్చేది. మెంబర్లుచేసే సూచనలు అంగీకరించపోతే, యిక యీ మెంబర్లు, యీ కవున్సిలుయొక్క ప్రయోజనము యేమిటి? ఎప్పుడు ఏ amendment propose చేసినా, అవి ముట్టుకోకుండా ప్రస్తుతానికి యీ బిల్లు కానివ్వండి అని చెప్పి ప్యాసు, చేయిస్తారు. లేకపోతే దానికి వేరె బిల్లు తెస్తామని అంటారు. ఇక అది అంతటితోసరి. మరల బైటికిరాదు అదేవిధముగా Inams Bill తెస్తామని యీ ప్రభుత్వము చెబుతూ వస్తూన్నది. దాని సంగతి యింతవరకు బైటికి రాలేదు. అలాగే Rent Reduction Act తెచ్చారు ఈ Rent Reduction Act విషయములోగూడ Inams Bill మాదిరిగా తకరారు జరుగుతునే ఉన్నది. ఏవో Amendments తెస్తామని అన్నారు. చెప్పడమేగాని, ఆ Amendments వచ్చేదిలేదు, మేము చూడబోయేదిలేదు. ఇవి అవి రానేరావు కాబట్టి ఎసెంబ్లీలో మాదిరికాకుండా, కవున్సిలుకు స్వేచ్ఛ యివ్వాలి అంటున్నాను ఎసెంబ్లీ, కవున్సిలు రెండూగూడ ప్రతిబింబములుగా ఉంటే ఏమీ ప్రయోజనము ఉండదు. నేను అనుకున్నది యేమిటంటే, క్రిందటిసారి నూతన Election

4th April 1956] [Sri R. B. Ramakrishna Raju

వచ్చినప్పుడు, 1952 తరువాత యీ ప్రకారము direct elections లేవు. కాబట్టి, ఏదో కవున్సిలులో కొంతవరకు భేదము ఉండవచ్చు ననుకున్నాను. అక్కడకూడ భేదము ఉండటానికి సావకాశము లేకుండా పోయింది. ఇందుకు కారణము ఏమిటంటే, మెంబర్ల యొక్క, కౌన్సిలు యొక్క ఆయుర్దాయము అంతా ప్రభుత్వము చేతులలో ఉన్నది వారు యిష్టపడితే, కౌన్సిలు ఉంచడము లేకపోతే, యీ కౌన్సిలు మాకు అక్కర లేదు అని ఒక Resolution pass చేసి ఎత్తివేయించటానికి సిద్ధపడడము జరుగుతుంది కాబట్టి ప్రభుత్వము తెచ్చిన బిల్లులు ఏవిఅయినాసరే, అవి మంచివి కాని, చెడ్డవి కాని, ప్యాసు చేయువలసిందే, కాదు అని చెప్పటానికి వీలులేదు, అనే మాదిరిగా కాకుండా కౌన్సిలుకు Indepence యివ్వాలి, లేకపోతే కౌన్సిలువుండి ప్రయోజనము లేదు. ఏ నాడు అయితే కౌన్సిలు ప్రభుత్వానికి వ్యతిరేకముగా బిల్లును ప్యాసు చేస్తుందో, ప్రభుత్వము మాట నెగ్గడము లేదని ఎత్తి వేయించటానికి చూస్తారు. ప్రభుత్వము ఎట్లా చెబితే అట్లా వినవలసివచ్చేదానికి, యీ కౌన్సిలు యెందుకు ? కాబట్టి కౌన్సిలు ఉండాలి అని ప్రభుత్వానికి నిజంగాఉంటే, దానికి రాష్ట్రములో మంచి అనుభజ్ఞులు ఏ Subject అయినా బాగా తెలిసినవారు ఉంటే మంచిది. వారు వారికిఉన్న అనుభవములనుబట్టి మంచి ~~సలహాలుయిస్తారు ప్రభుత్వం ఆ ప్రకారము చేయదలిస్తే~~, కౌన్సిలు పెట్టండి. లేకపోతే, అది వద్దు. కాని కౌన్సిలు ఉండాలి అనేవాలో నేను ఒకణ్ణిగాని దానికి స్వేచ్ఛ యివ్వకపోతే, ప్రయోజనము లేదు ఇప్పుడు American Constitution లో కూడ, అక్కడ Senates లోగాని, House of Representatives లోగాని, ఏ బిల్లు అయినా రెండు సభలలోను ప్యాసు అయితేనే, అది President assent కు పోతుంది. లేకపోతే, ఆ బిల్లు వెనుకకు తిరుగవలసిందె కాని మనకు అట్లాకాదు, ఎసెంబ్లీలో ప్యాసు చేసిన బిల్లు కౌన్సిలుకు పంపిస్తారు. అది కౌన్సిలులో ప్యాసు చేయకుండా తిరిగి Assembly కు Remit చేస్తే, మరల రెండవసారి పంపుతారు. అప్పటికి ప్యాసు చేయక తిప్పి పంపివేస్తే, అది తిరిగి మూడవసారి పంపిస్తారు. మూడవసారిగూడ కౌన్సిలు ప్యాసు చేయకుండా త్రిప్పివేస్తే, అప్పుడు ప్రభుత్వం ఎర్ర సిరాతో ఒక గీటుపెట్టి, మేము చెప్పిందే ఘనవాక్యం, మేముచేసిందే Law, అని యిష్టగా చేయించుకుంటారు. అటువంటి దానికి యీ కౌన్సిలు ఎందుకు ? కాబట్టి కౌన్సిలు ఉండవలెనంటే దానికి స్వేచ్ఛమాత్రము ఉండాలి. ఇప్పుడు సాధారణముగా ఎసెంబ్లీలో జరిగేచర్చవేరు, కౌన్సిలులో జరిగేచర్చవేరు. కౌన్సిలు వారు చెప్పింది ప్రభుత్వం వినాలి. వినకపోతే ప్రయోజనములేదు. కాబట్టి యిక ముందు రాబోయే ఏ మంత్రులు అయినా సరే, కౌన్సిలు మనకు ఉండాలి అని అంటు

న్నారు కాబట్టి కౌన్సిలుచేసే సూచనలు, వాటి సారస్యము గుర్తించి, ఒకవేళ Amendments suggest చేస్తే, అవి బిల్లులో Incorporate చేసి, ఎసెంబ్లీలో మరల ప్యాసుచేయించుకుని, కౌన్సిలులో ప్యాసుచేయించాలి. ఆ తరువాత నే President assent కు పంపాలి. ఆ విధముగాచేస్తే, కౌన్సిలుకు ఒకగౌరవము ఉంటుంది, ప్రభుత్వానికి గౌరముఉంటుంది మేము మద్రాసులోఉండగా ఒక విషయము జరిగింది. చెబుతాను వినండి. ఆదిత్యన్ అనే కౌన్సిలుమెంబరు Birds and animals, Sacrifices ను గురించి ఒక Bill ను తెచ్చి ప్రభుత్వానికియిస్తే దానిని రెండు మూడేళ్లుదాకా బైటికి ప్రభుత్వం రానివ్వలేదు. మేము యింతా తంటాలుపడితే, చివరికి ఒక్క Resolution గాబోలు, ప్యాసుచేయటానికి వీలు కలిగింది. అంతకంటే మేము యేమీచేయకలేకపోయినాము. కాబట్టి కౌన్సిలు పెట్టితే పెట్టండి.

Mr. DEPUTY SPEAKER :—ఇంగ్లండులో పార్లమెంటరీ ప్రాక్టీసు ఎట్లా ఉంటుంది ?

Sri R. B. RAMAKRISHNA RAJU :—అక్కడికి, యిక్కడికి చాలా భేదముఉన్నది. ఏమిటంటే, అక్కడ House of lords is not an elected body, but it is a hereditary body, కనుక అక్కడ దానికి యిక్కడ మన దానికి చాలా తేడా ఉన్నది. I am not an admirer of British parliamentary practice. That I may tell you definitely But I admire American Constitution. ఇక్కడ మనము యింతమంది ప్రజల తరఫున వచ్చి యిక్కడ కూర్చుంటూ వున్నాము. మేము చెప్పే మాటలు ప్రభుత్వము వినకపోతే ప్రయోజనము ఏమిటి ? ఇప్పుడు మా పార్టీ సంగతే కాదు ఈ తడవ ఎలెక్షనులు కాకముందువరకుగూడ నేను కాంగ్రెసులో ఉన్న వాణ్నే గదా.

The Hon. Dr. B. GOPALA REDDI :—American Constitution లో అసలు అక్కడ మంత్రులు ఎదురుగా కూర్చోరే ?

Sri R. B. RAMAKRISHNA RAJU :—లేదు.

The Hon. Dr. B. GOPALA REDDI :—కాబట్టి వారు ఎక్కడి నుంచో మాట్లాడుతూ వుంటారు. ఎక్కడి నుంచో వింటూ ఉంటారు.

Sri R. B. RAMAKRISHNA RAJU :—సరే. అట్లా అయితే మంత్రులు కవున్సిలులో కూర్చోకుండా ఉండాలి. లేదా, ఊరకనే కూర్చోండి. దానికి మేము ఒప్పుకొంటాము. దానికే మాత్రము ఆక్షేపణ లేదు.

THE HON. DR. B. GOPALA REDDI :—ఆ విధముగా చేయాలి అంటే, అసలు మన constitution నే, మార్చాలి గదా.

SRI R. B. RAMAKRISHNA RAJU :—Constitution మార్చవలసి వస్తే, మార్చుకుందాము American Constitution ప్రకారము మన constitution మార్చుకొన్నా గూడ, మీరు. మీ మెంబర్లే గదా కౌన్సిలులో ఉంటేది! , వారు చెప్పిన మాటలు అయినా ఒప్పుకోకపోతే ఎందుకు ఈ కౌన్సిలు? ఈ కౌన్సిల్ కోసము యెందుకు యీ సభ? మాపాటికి మేము యింట్లోనే ఉండిపోతాము. మీకు పది మందిగూడా అధికారము యిస్తారు మీరే చెయ్యండి రాజ్యం. వారే అధికారము అంతా చలాయిస్తూ, చట్టాలు యిష్టము వచ్చినట్లుగా చేయవచ్చుగదా. లేకపోతే వారి పార్టీ వారు ఏదైనా ఒక చట్టము తెస్తే, వారి పార్టీవారెవరైనా విమర్శించి, దాని మంచిచెడ్డలు చూడటానికైనా అవకాశము ఉండదా? నేను మీపార్టీలో మొన్న మొన్నటిదాకా ఉన్నవాణ్ణేగదా! ఆనాడు మీ పార్టీలో ఏమి జరుగుచున్నదీగూడ నేను చూచాను. అదిగూడ నాకు తెలుసు నే!—

మేమంతా ప్రజల దగ్గర ఓట్లు పుచ్చుకుని democratic గానే వచ్చినాము. మామాట మీరు వినాలా? వనిలేదా? ఆ విలువ ఎట్లా వస్తుంది? ఈ democracyలో రానేరాదు. మీరు council పెడితే పెట్టండి కాని ఇకమీదట వచ్చే మంత్రులైనా ఆ council కు గౌరవం ఇచ్చి, వాళ్లు చెప్పేమాటలు మంచివా కావా, అట్లాచేయవచ్చునా లేదా అని యోచించి మీ కార్యక్రమం నడపవలసి యుంటుంది.

SRI K. BRAHMANANDA REDDI :—ఆ మాటలు అసెంబ్లీలో చెబుతున్నారు గదా.

SRI R. B. RAMAKRISHNA RAJU :—మీకు కూడా గౌరవం లేదనే నేను చెబుతున్నది. మనమంతా ఇంటికి పోదాం. వాళ్లు 7 గురో 8 గురో మంత్రులు కూర్చుని రాజ్యం చేసుకొంటారు.

ఇంక బళ్ళారి విషయంలో ఆ విషయం మాట్లాడ దలచినప్పుడు నాకు ఒక చిన్న కథ జ్ఞాపకం వస్తోందండి. ఒక judge గారుండే వారట. వారు వాది తరపున కాకుండా, ప్రతివాది తరవున కాకుండా సాక్షిపక్షమున decree ఇచ్చాడు. ఆ మాదిరిగా ఉంది బళ్ళారి సంగతి. మేము 50, 60 ఏళ్లుగా తుంగభద్రా

Sri R. B. Ramakrishna Raju] [4th April 1956

project కావాలని ఆందోళన చేశాం. డబ్బంతా ఆంధ్ర, హైదరాబాదు ప్రభుత్వాలు పెట్టుకుని project కట్టుకుంటే, చివరకు పెత్తనం మాత్రం మూడో వారికి, మైసూరుకు కిచ్చారు. ఇదేమి న్యాయం. ఇది ఎంతవరకూ సమంజసం? ఎన్ని కోట్లు మనం ఖర్చుపెట్టాం. మన ఆంధ్ర దేశంలో వెనుకబడిన ప్రాంతమైన రాయలసీమ జిల్లాలకు ప్రాణాధారమైనటువంటి పెద్ద project కట్టుకుంటే అది మీ కివ్వం, మూడవ వాడిచేతులో పెడతాం, వాణ్ణిపోయి అడగండి అని చెప్పడం ఎంత సమంజసంగా ఉన్నదో నాకు బొత్తిగా అర్థం కావడంలేదు. మొన్న భారత ప్రధాని మన ముఖ్యమంత్రిగారితో మాట్లాడుతూ "మీ కేమయ్యా! కావలసినంత నీటి సౌకర్యం కలుగజేశాం" అన్నారు నీటి సౌకర్యం కలుగజేయడం ఎటువంటిదో court లలో practice చేసేవాళ్ళకు తెలుసును. ఎక్కడైనా ఒక భావిలో నుంచో, ఒక గుంటలో నుంచో, ఒక చెరువులో నుంచో కాలువ తీసుకురావాలంటే ఇద్దరు ముగ్గురు జగడమాడి ఎన్ని court లకైనా పోయి, ఎన్ని డిక్రీలు పొందినా, డిక్రీలు అట్లనే ఉంటాయి. అక్కడ కాలవలో పారేనీరు వేరేగా పారుతూ ఉంటుంది. ఏక్కడయినా ఒక మడవ పెట్టిస్తే నీళ్లు వాటంతట అవే పోతూ ఉంటాయి. అందుచేత ఆ నీళ్లను కట్టిపెట్టి decree ల చేత, ఈ safe guards చేత మనం సక్రమంగా పారేటట్లుజేసి, మనకు కావలసిన వసతి కల్పించుకోగలం అంటే వట్టి మిథ్య. అది ఎప్పుడూ జరగనే జరగదు. తుంగభద్ర project management మనచేతులలో ఉంటేగాని మనదేశం బాగుపడదు అనే విషయం గమనించి, ఈ బళ్ళారి విషయంలో ఈ S. R. కమిటీ వాళ్లు చెప్పిన విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటి నన్నిటినీకూడా తుడిచి పారేసి ఒక్క నీటి విషయమే చెప్ప లేరు వాళ్లు.

> "What has weighed with us in arriving at the conclusion to which we have referred is the cumulative effect of three main considerations, namely, administrative convenience, economic links, the importance of Tungabhadra project to the Rayalaseema of Andhra."

Andhra Administrative convenience కోసం ఎన్నో చెప్పారండి వారు. బళ్ళారి మన ఆంధ్రలో ఉండడమే దానికి ప్రాణం అనికూడా చెప్పారు. ఇంతగొప్పగా చెప్పినాకూడా దాన్ని ఏమాత్రం గమనించకుండా త్రోసివెయ్యడం ఆంధ్రకి చాలా బాధకరంగాఉంది. ఇప్పటికైనాసరే దీన్ని సరిదిద్దేవిషయమై

4th April 1956] [Sri R. B. Ramakrishna Raju

ప్రయత్నంచేస్తే బాగుంటుందని నాఅభిప్రాయం. ఈ zonal councils విషయంలో నిన్ననో, మొన్ననో C. రాజగోపాలాచారి గారు ఒకప్రకటన చేశారు. "జగడమాడుకోవడం తప్ప అక్కడేమీ పనిజరగదు. It is only a place for quarrel between two or a number of States" అన్నారాయన State కూ State కూ మధ్య ఏదైనా ప్రశ్న ఉదయించినప్పుడు, పరిష్కారంకోసం మూడోవారి దగ్గరకుపోకుండా, సంబంధించిన ఆరాష్ట్రాల నాయకులు ఒకచోట కూర్చుని చర్చించి తీర్మానం చేసుకుంటే బాగుంటుందనే ఉద్దేశ్యంతో zonal councils పెట్టారని మేమనుకుంటున్నాం. ఐతే ఈ zonal councils లో అక్కడనుంచి ఒక Minister, ఇక్కడ Minister లు, Chief Minister, ఇంకా ఇద్దరు Minister లు లేక Chief Secretary అని, ఈ ప్రకారంగా ఆ Councils లో ఉండి కార్యక్రమం జరపాలని ఉందికాని, అందులో ఈ సభకు ఎక్కడా ప్రాతినిధ్యం కనబడలేదు. ఆ zonal councils లో వచ్చేవిషయాలు అధికార్లతోనే అంతం ఐపోతాయా, ప్రజలకేమీ సంబంధంలేదా? ప్రజలకు ప్రతినిధులుగా ఉండేవాళ్లకు ప్రాతినిధ్యం ఇస్తే ఏమండీ తప్పు. Zonal council ఉండడం అవసరమని మీకు తోచేపక్షంలో ఈసభకుకూడా అందులో ప్రాతినిధ్యం ఇస్తే బాగుంటుంది. అన్నిసభలకూ ఇక్కడ నుంచేగదా మనం ప్రతినిధులను పంపిస్తున్నాం. ఆప్రకారమే zonal councils కు కూడా పంపించాలని నా అభిప్రాయం. ఇక Elections విషయంలో ఇప్పుడైనాసరే అప్పుడైనాసరే అంతా సిద్ధంగానే ఉన్నాం. ఐతే 57 సంవత్సరంలోనే పెట్టవద్దని మా అందరియొక్క అభిప్రాయం. ఏమంటే మొన్ననేకదా ఎంతో బాధపడ్డాం. 57 లో election వారికే అని అన్నారు. అది ఇంకా రెండేళ్లు పొడిగిస్తే చాలా సంతోషం. ఆప్రకారం చేస్తారని ఆశిస్తున్నాం.

SRI H. RAMALINGA REDDI :—Mr. Deputy Speaker, Sir, I rise to express my strong protest against this Bill (laughter) not for what it contains, but for what it does not contain I refer to the non-implementation of the recommendations of the States Reorganisation Commission Report in regard to Bellary district. The recommendations of that report are the natural, equitable, just, rational and scientific permanent solutions as to the frontiers between the future Andhra and Karnataka States if we bear in mind the historical, cultural and administrative factors in addition to language. You know, Sir, that for six hundred years the Andhras and the Karnatakas had lived together, and that

composite existence has been maintained all along. About 25 lakhs of Andhras are settled in Mysore State. That is admitted even by the Chief Minister of Mysore About three or four lakhs of people only are settled down to the east of Hampi, the capital of Vizianagaram Empire now in ruins. This capital city, now in ruins was the joint enterprise of Telugus and Karnataks Krishnadevaraya and his Ashtadig gajas is the cherished tradition and inheritance of both people and brings to the mind of every Karnatak and Telugu the glorious history of their past Now that compactness of existence is a point to be considered by the Government The situation of the head works of the Tungabhadra project near Mallapuram, a few miles from Hampi, is a necessity for us, so that the Andhra Government could have control over it to ensure the prosperity of Rayalaseema. The transfer of Bellary to Mysore has created considerable administrative and economic difficulties not only for the people of Alur, Adoni and Rayadrug but also for the rest of the people of Rayalaseema The retention of Kolar in Mysore, which is a predominantly Karnataka Telugu area, on the ground of composite existence and in the interests of administrative and economic factors, that principle holds good in the case of the taluks of Hospet, Siruguppa and Bellary, which the States Reorganisation Commission Report has recommended to be transferred to Andhra State Further there was a division for Congress work under the Kelkar award, but it did not affect the normal life of the people, and it is now irrelevant to consider it. After that in 1943, there was a bifurcation of the district as per the report of Misra. That is only in the nature of a partial partition All the parties to the dispute were not before it For, then, it was not considered what Mysore should give to Andhra State in exchange for those areas, on linguistic basis, now the serious consequences that will entail on the transfer of Bellary and the people and on the rest of Rayalaseema were not gone into. The question of the headworks, which is the life-

4th April 1956] [Sri H. Ramalinga Reddi

line of Rayalaseema if not given to the Andhra area and the serious consequences that will follow were not considered. Already we have had the bitter experience of three or four years before us with the Mysore State It has given any amount of headache to this Government. We have not been able to push up the High Level Canal scheme. There were frequent troubles and frictions, which we could have avoided if only we had adopted Justice Wanchoo's report. After the bifurcation of the district, the Government of Andhra and the people of Bellary agitated against this decision, and then the States Reorganisation Commission was appointed to go into the question of not only Bellary but the entire State. Then all the parties were before it The entire country was in the hotch-potch. This was in the nature of final partition So this was the time when we could have redress for past mistakes, when injustice could be set right and inequalities also could be set right That was the proper occasion for all that. The Prime Minister of India also had assured a deputation of Rayalaseemites on the 1st October, 1953 when Andhra State was inaugurated in Kurnool that the question of Bellary would be re-examined by the States Reorganisation Commission that was going to be appointed. And then, after the publication of the Commission's report the Prime Minister had assured the country that the recommendations of the Commission's report would be implemented *in toto* unless there is a change agreed to by the parties concerned. Now Government have gone back on them, and consequently people feel very much dissatisfied over this Bellary issue. I do not know why the leaders should go back on their promises, as also the High Command, the leaders and the Government of India. Our diplomacy has always been frank and open, but the diplomacy of Mysore has been subtle and secret, and so our leaders have been outwitted. There is also another point. There is no connection between the grant of Visalandhra and Bellary being denied to us. So it is all the more necessary that the recommendations of the States Reorganisation Commission

Sri H. Ramalinga Reddi] [4th April 1956

should be implemented to discharge our new obligations to the Telangana people. If that is implemented the headworks would be transferred, and the Government of Andhra would be relieved of the worries of faminė which are frequently happening in Rayalaseema, and thereby its resources might be diverted to Telangana. It is felt on all hands that while there are Karmarkars and Dattars in the Central Government to back up Mysore on their unreasonable attitude, there is none in the Centre to back us up from Andhra. Again, Sir, there is a point made against us, that Kolar people are not agitating to join Andhra. I want tnat that issue should not be made a point against us. Because the principle of linguistic provinces has been introduced by the Congress only in British India. It was not injected in the native States, for it was contended that it was a disintegrating factor. Now, Sir, Mysore cannot claim to retain the entire territory on the ground of compact existence and at the same time take advantage of the effects of disintegration. They cannot have both ways. They cannot say, 'Heads I win, tails you lose'. As it is, they stand to gain on both grounds. Let me make myself clear. Mysore State claims Kolar and other Telugu areas on the ground of compactness, which is denied to us with regard to Kolar, but they want to take advantage of disintegration which is injected into British India. Now in the principle of disintegration, they want to take the benefit with regard to Bellary, they want to claim all the three taluks which hvae been recommended by the States Reorganisation Commission to be transferred to Andhra. So they cannot have both ways. Lastly our agitation has been democratic and constitutional. The Mysore Government has connived at the immoral Satyagraha, which is evidenced by the punishment they inflicted on those Satyagrahis. Those people who were called Satyagrahis, the so called Satyagrahis, were taken to court in a van supplied by Government and were given punishments lasting for a few hours, like imprisonment till the rising of the court, and were then let off. What was the

4th April 1956] [Sri H. Ramalinga Reddi

result ? They came again the next day, and that is the sort of Satyagraha that was started there. This pressure tactics of the Mysore Government seems to have succeeded. By that let not our people lose heart in legitimate and constitutional methods. Sir, leaders appeal to the unity of India, but that appeal is addressed only to one of the parties, the other party all the while being allowed to retain its dishonest gains. Sir, the best foundation for national unity depends on the contentment of the people, which in its turn depends on just decisions. Here, I must inform the Government of India through you, Sir, that our people are very much dissatisfied over the Bellary issue By this unjust decision the Government of India are driving a thin wedge between the people and their representatives The people of Bellary have become so desperate and so dissatisfied that they now ask 'merge us with Alur and Adoni so that we can live together as a unit'. So this is a very bad state of affairs, and this should be set right at once. 'Now or never' is the question. If we make a joint effort along with the Telangana leaders I trust we can achieve this object. To my Communist friends, I say, 'by all means we hope to get Kolar and other Telugu areas from Mysore'. Finally, Sir, I submit that I strongly disapprove of this Bill in so far as the three taluks of Bellary district and Tungabhadra project are denied to us. Thank you, Sir.

Sri P. V. R. GAJAPATHI RAJU :—Mr. Speaker, Sir. I have specially come to debate on the States Reorganisation Bill. Colleagues of mine may be aware that I did not attend the whole budget session; but there was a reason for not attending the budget session. In a way I wanted my action to be in the nature of an individual protest, because I feel that much of the debate that goes on in the House during Money Bills normally takes the form whereby neither the suggestions in the opposition nor those of the Government Benches themselves are taken into consideration; and therefore, instead of participating in a repetetive drama which

Sri C. Subbarayudu] [4th April 1956

ప్రజలు ఏకమై ఒకే రాష్ట్ర ప్రభుత్వము క్రింద ఒకటిగా ఉండడానికోసం ఈ ఉద్యమాన్ని ప్రారంభించి, ఇంతకాలమూ ప్రయత్నం చేశారో, అది ఈనాడు నెరవేరిందా లేదా అనేది మనము ముఖ్యంగా ఆలోచించవలసియున్నది.

మనమేకాదు, ప్రతిఒక్కరూకూడ యీనాడు ఆలోచిస్తున్నారు. ఒకవైపున సంతోషము, ఇంకొకవైపున విచారము ప్రజలలో ఏర్పడ్డది. మనము ఆశించినవిధముగా మనకు విశాలాంధ్ర ఏర్పడలేదు అనే విచారము ఎక్కడ చూచినా ప్రజలలో కన్పిస్తున్నది. అందులో ముఖ్యంగా సరిహద్దురాష్ట్రాలలో ఏఏ ప్రాంతాలలో ఆంధ్రప్రజలు ఎక్కువ మెజారిటీలో ఉన్నారో, అవి మన ఆంధ్రలోనికి న్యాయముగా రావాలని కోరుతూఉన్నాము వేటికొరకైతే మనము ఆందోళన సాగిస్తూవచ్చామో, అవి మనకు రాకుండా, ఇతరరాష్ట్రాలలోనే ఉంచబడినవి. అవి మనకు రాకుండాపోవడమువల్ల ఆంధ్రప్రజలందరికి చాలా విచారకరంగా ఉన్నది. ఆ ప్రాంతాలు అన్నీ ఆంధ్రలో చేరేటంతవరకు ఆ ప్రాంతాలలో ఉండే ఆంధ్రులుగాని, వారికొరకు తహతహలాడే యిక్కడ ఆంధ్రులుగాని ఆందోళననుంచి విరమిస్తారని మనము అనుకోలేము.

నూతనముగా ఏర్పడబోయే రాష్ట్రమునకు నామకరణముచేసే విషయములో "ఆంధ్ర" అని మనము అంటూంటే, "ఆంధ్ర-తెలంగాణా" అని హైదరాబాదు వారు అంటున్నారు. నూతనరాష్ట్రానికి ఏపేరు పెట్టినప్పటికినీ ఉభయప్రాంతాలవారూ కలిసిపోయినతరువాత ఉభయులమూకూడ యింతటితో తృప్తిపడి కూర్చోకుండా, మిగిలిపోయిన ఆంధ్రప్రాంతాలను మనలోకితెచ్చుకోటానికి ఒక్కుమ్మడిగా కృషిచేయవలసి ఉంటుంది. మైసూరు రాష్ట్రములోవున్న కోలారు ఆంధ్రులు కానివ్వండి, సేలముజిల్లాలోఉండే కృష్ణగిరి, హోసూరు ఆంధ్రులు కానివ్వండి, చిత్తూరు జిల్లాలో సరిహద్దు తాలూకాలలో ఉన్న ఆంధ్రులు కానివ్వండి, పర్లాకిమిడివగైరా ప్రాంతాలలోఉన్న ఆంధ్రులు కానివ్వండి, ఏఏప్రాంతాలు మనకు రాలేదో అక్కడ ఉన్న ఆయా ఆంధ్రులనందరినీ మనము చేరదీసుకున్ననాడే మన చిరకాలవాంఛ నెరవేర్చుకున్నవారమవుతాము. అప్పటికిగాని ఆంధ్రులయొక్క బాధ్యతలు తీరిపోవు. దురదృష్టవశాత్తూ యీనాడు అది జరగలేదు. మనలోవున్న బళ్లారి, దాని సరిహద్దుతాలూకాలను తుంగభద్రతోసహా తీసుకొనివెళ్ళి మైసూరులో అన్యాయముగా కలిపివేశారు. వాటిని తిరిగి యిచ్చివేయమని ఆందోళన చేసినను, దానిప్రసక్తేమీ రాలేదు. కేవలము విశాలాంధ్రకోసము మనము సాగించిన ఉద్యమములో తెలంగాణాలో ఉన్న నాయకులు కానివ్వండి, అక్కడప్రజలు కానివ్వండి వారికి ప్రత్యేకరంగా రాష్ట్రము కావాలనే

వాదవ లేవదీయడములేదు మన ఆంధ్రులకందరికి ఒక్కటే విశాలాంధ్ర ఏర్పాటు చేయమని మనము యిక్కడ ఆందోళనచేయడము యిది అంతా జరగడములోనే ఎక్కువకాలము మనము వృధాచేసినామేమోననే సందేహముమాత్రము నాకు కనబడుతున్నది. ఈ విధముగా కాలము వృధాచేసేదానికంటె మనము, మన నాయకులు మన ఆంధ్రులనందరినీ ఒకచోట చేరదీసుకోటానికే ముందు ప్రయత్నించిఉంటే మనకు యీనాడు ఏర్పడిన దురదృష్టకరమైన యీ పరిస్థితులు ఏర్పడి ఉండేవి కావేమో నని నాయొక్క వ్యక్తిగత అభిప్రాయము ఉదాహరణకు బళ్లారివిషయం చూడండి. పూర్వంనుంచి బళ్ళారిజిల్లా మనలో ఉండేది. అది మనలోనుంచి విడదీయబడ్డది. దీనివల్ల అక్కడవున్న ఆంధ్రులు ఎంతయిబ్బంది, ఎంత నష్టము పడుచున్నారో గుర్తించవలసియున్నది. వారిని మన మధ్యనుంచి విడదీయడము అన్యాయము, అక్రమము. ఇది చాలా విచారకరమైన విషయము. ఆనాడు కేంద్రప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన కమిటీలు బళ్లారివిషయము కూలంకషంగా విచారణచేసి ఆంధ్రులు, కర్నాటకులు చెప్పినవాదనలను వినడము జరిగింది. ఈకమిటీలకు అధ్యక్షస్థానము వహించిన మిశ్రాగారు కానీయండి, వాంఛూగారుకానీయండి, ఉభయులూ కూడా ఉభయపక్షముల వాదనలు సమగ్రంగా పరిశీలించారు. తుంగభద్రప్రాజెక్టును గురించి దానియొక్క సాధకబాధకాలు ఉభయరాష్ట్రములకు సంబంధించిన ఇంజనీర్లు చెప్పగా విన్నారు. నాకు తెలిసినంతవరకు యీ విచారణ అయినతరువాత చివరకు తుంగభద్రబోర్డును నిర్మాణము చేయడము జరిగింది. ఇన్ని జరిగినతరువాత గూడ కమిటీవారి రిపోర్టులో "After serious consideration" అనే పదములు ఉపయోగించినప్పటికినీ, బళ్లారినిగురించి కమిటీవారు చేసిన సిఫార్సులను కేంద్రప్రభుత్వమువారు ఒప్పుకోలేదంటే ఇంతకంటే దురన్యాయము వేరే ఉన్నదా అని అంటున్నాను. ఇన్ని ప్రయత్నములుచేసినను బళ్లారిని మరల మనము సాధించుకోలేకపోయినామంటే యిది ఎవరియొక్క లోపమో మనము విచారించుకోవలసియున్నది. మన లోపమా ? లేక కేంద్రప్రభుత్వముయొక్క లోపమా ? ఇది ఎవరిలోపమో ఆలోచించవలసిన విషయమే. మనకు వీలు అయినన్ని ప్రయత్నములు లెక్కలు వగైరాలు కమిటీవారికి అందజేసి బళ్లారి మనకు రావలసియున్నదని ఋజువుచేశాము. ఇందులో మనలోపమేమాత్రమూ లేదు. కమిటీవారుచేసిన సిఫార్సులు ఒప్పుకోకపోవడము కేంద్రప్రభుత్వమువారి లోపమని చెప్పకతప్పదు. ఇది చివరకు ఏవిధముగా పరిష్కారము అయినప్పటికినీ బళ్లారిని దాని సరిహద్దు తెలుగుతాలూకాలు, తుంగభద్రప్రాజెక్టు ప్రాంతము ఆంధ్రలో చేరేవరకు, అక్కడ ఇక్కడ ఉన్న ఆంధ్రులు ఏమాత్రము నిద్రపోరు అని నేను హెచ్చరిస్తున్నాను. ఎవరు ఏలోపముచేసిననూ, బళ్లారి విషయంలో మన ఆంధ్రులలో ఒక్క విషయంమాత్రం వ్యాపించింది. కొంతవరకు

Sri C. Subbarayudu] [4th April 1956

మన పార్టీలనాయకులవల్ల కానివ్వండి, పార్టీలో ఉన్న అనైక్యతవల్ల కానివ్వండి, బళ్ళారి విషయములోమాత్రము చేయవలసిన పూర్తిప్రయత్నములు మన కాంగ్రెసు నాయకులుచేయక నిర్లక్ష్యముచేశారని ఖచ్చితముగా చెప్పకతప్పదు. ఈ విషయములో చేయవలసిన ప్రయత్నమంతా చేయకపోవడంవల్లనే, దీనిని మనము సాధించుకోలేక పోయాము. అది మన లోపము అని ప్రజలలో అభిప్రాయము కలిగింది ఈనాడు బొంబాయి నగరము కేంద్రప్రభుత్వమువారి చేతిక్రిందకు తీసుకుంటూ వున్నారంటే అది ఏ కారణముచేత తీసుకుంటూవున్నరో దానికి కారణం వేరే వున్నది. కేవలం భాష అనే కారణముకాకుండా ఆర్థిక వ్యవస్థను గురించి కూడ కేంద్రప్రభుత్వము ఆలోచించి ఆ విధంగా చేస్తూవుండవచ్చు. కాని బళ్లారి విషయం మాత్రము ఆ దృష్టితో ఆలోచించనక్కరలేదు. బొంబాయిగూడ ఒక పెద్ద పట్టణముకావచ్చు. దానికి పెద్ద ప్రాధాన్యముగూడ వుండవచ్చు. బొంబాయి ఏ పరిస్థితులలోవున్నదో ఆ పరిస్థితులలోనే, ఈనాడు బళ్లారిగూడ వున్నది. బళ్లారి, దాని పరిసర తెలుగు ప్రాంతాలలో ఏర్పడిన ఆర్థికదుస్థితి వల్ల అక్కడ ప్రజలందరు యిప్పటికే చాలామంది విడిచిపెట్టి పోవటము తటస్థించింది. ఈ బిల్లువచ్చిన తరువాతగూడ అక్కడవున్నవారివల్ల ఇంకా ఎక్కువగా ఆందోళన జరుగుతున్నది. చాలమంది ప్రజలు, బళ్లారినుంచి బయిటికి వెళ్ళిపోవటానికి ఏర్పాట్లు చేసుకుంటున్నారు. బళ్లారి, కర్ణాటకులకు చేరకముందు, అక్కడవున్న ఒక్కొక్కయిల్లు 30, 40 వేలు చేసేదిగాని, ఒక్కొక్క ఫ్యాక్టరీ లక్షలకొలది చేసేదిగాని, అమ్మకానికి పెట్టగా, అవి కొనటానికి అడిగేదిక్కు లేకుండాపోయింది. దీనివల్ల అక్కడవున్న ఆంధ్రులు ఆర్థికంగా ఎన్నో కష్టనష్టాలకు, యిబ్బందులకు గురిఅవుతున్నారో చూడండి. బళ్ళారి, దాని పరిసర తెలుగు ప్రాంతాలు ఆంధ్రప్రాంతమునుండి ఎప్పుడైతే, శాశ్వతముగా, విడదీయడము జరుగుతుందో ఆనాడు, ఆ ప్రాంతాలన్నీ ఒక శ్మశానభూమిగా ఏర్పడడం తటస్థిస్తుందని నేను చెప్పగలను. అంతేకాకుండా అక్కడవుండే తెలుగు గ్రామాలన్నీ తప్పక దెబ్బతింటాయి. ఎందుకంటే బళ్ళారిలోని ప్రజలకు, ఏ సమయములోనైనా 10 రూపాయిలు కావాలన్నా ఏ వస్తువు కొనుక్కోవాలన్నా, అమ్ముకోవాలన్నా వీలులేకుండా ప్రజలు యిబ్బందిపడుతున్నారు. బళ్ళారిజిల్లా అంతయు పూర్వమునుంచీ ఆంధ్రులచేతులలో వున్నందున అది ఒక వ్యాపారకేంద్రంగా అయినది. అటువంటిది ఈ విభజనవల్ల, వాళ్ల పెట్టుబడికి సరాఫరా లేకపోవటం వల్ల వారి వ్యాపారం దెబ్బతిన్నది. కాబట్టి ఇటువంటి పరిస్థితులలో మన ఆంధ్ర నాయకులు, ఇప్పుడైనాసరే మేలుకొని వాటిని మన ఆంధ్రప్రాంతములో చేరదీయటానికి శ్రద్ధ తీసుకోవాలని మనవి చేస్తున్నాను.

హైకోర్టు విషయముచూస్తే మన తెలంగాణా సోదరులు సర్కారాంధ్రులకు గాన, వేరే హైకోర్టుబెంచి గుంటూరులోనే పెట్టుకోవలసిందిగా సలహాయిస్తున్నారు. రాయలసీమలోని మూడుజిల్లాలవారిని హైదరాబాదు హైకోర్టుకు రమ్మని సలహాయిస్తున్నారు. ఈ విషయంలో వారి సిఫారసును మనము పాటించనక్కరలేదు. ప్రభుత్వము దయచేసి దీనికొరకు మాత్రము ప్రయత్నము చేయవద్దని కోరుతున్నాను. రాయలసీమవారు దీనికి ఎవరూ ఒప్పుకోరు. రాయలసీమజిల్లాలు కేసులు ప్రస్తుతం వున్న ప్రకారమే జరగటం న్యాయమని, సబబుఅని అంటున్నాను. హైదరాబాదు రాజధాని నగరము అయినప్పుడు, తెలంగాణావారికి అవసరంవస్తే వారే వేరేబెంచి హైదరాబాదులోనే పెట్టుకోవచ్చు. ఇది న్యాయసమ్మతముగాను, ధర్మముగాను వుంటుంది. అంతేగాని, మనకు హైదరాబాదు హైకోర్టుతప్ప, ప్రత్యేక బెంచి అవసరంలేదు. ప్రభుత్వము ఆ విధంగాచేస్తారని ఆశిస్తున్నాను.

నూతన రాష్ట్రానికి, "ఆంధ్ర తెలంగాణా" అని పేరుపెట్టారు. ఇది ఏ మాత్రము, బాగుగలేదు. ఒక రాష్ట్రానికి రెండుపేర్లు పెట్టడమనేది న్యాయసమ్మతముగాదు. హాస్యాస్పదముగా వుంటుంది. మనమందరము ఆంధ్రులమే గనుక ఆంధ్రప్రదేశ్, అనిగాని, "తెలుగుప్రదేశ్" అనిగాని ఒక్కపేరుపెడితే బాగుంటుంది. అది నా వ్యక్తిగత అభిప్రాయము.

ఇకపోతే Zonal committees విషయంవున్నది. ఇందాక ప్రగడ కోటయ్యగారు చెప్పినట్లుగా ఏఏ ప్రాంత్యాలు అయితే వెనుకబడివున్నవో ఆ ప్రాంతాలకు వసతులు కలుగజేయడానికి ఈ Committeeలు పెడితే వుపయోగముగా వుంటుంది. అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందుకు వారికి నా అభివందనములు తెలియజేస్తున్నాను.

Sri C. P. THIMMA REDDI :—అధ్యక్షా, విశాలాంధ్ర ఏర్పడనున్న యీ శుభ సమయములో, మన ఆంధ్ర నాయకులు చేసిన కృషి ప్రధానమైనప్పటికిని, మనకు రావలసినదంతా రాకపోయినప్పటికినీ, ఏదో కొద్దిగానైనా వచ్చిందని సంతోషపడుతున్నాను. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడే యీ సమయములో భగవంతుడు మనకు విశాలాంధ్ర ఏర్పాటు చేయుచున్నందులకు భగవంతునికిన్ని, దీనికొరకు కృషిచేసిన పెద్దలకున్నూ నా కృతజ్ఞతను తెలుపుతున్నాను. ఒకరు హీనస్థితిలో ఉంటే, యింకొకరు ఉన్నత స్థితిలో ఉండడము ప్రకృతి లక్షణము. కష్టసుఖాలు, సుఖ దుఃఖాలు ఒకరిని విడచి ఇంకొకరికి ప్రాప్తిస్తూఉంటాయి ఇదంతాకూడా ప్రకృతి లక్షణం. అలాగే దినములో ఒకప్పుడు రాత్రివస్తే యింకొకప్పుడు పగలు రావడము జరుగుచున్నది. అట్లాగే ప్రకృతికూడ

Sri P. Bapayya] [4th April 1956

సభ్యులు సూచించారు. ఆ పేర్లు బాగానే ఉన్నవి. ఆ పేరును తెలంగాణావారు కూడా అంగీకరిస్తే బాగానే ఉంటుంది. లేకపోతే వారు ఏ పేరు కావాలంటున్నారో ఆ పేరుతో మనంకూడా ఏకీభవించడం చాలా మంచిది. అన్నిటికంటే "తెలుగు" అనేది చాలా అందమైనపేరు. "తెలుగు" అనేదానికి చాలా ప్రాముఖ్యతఉన్నది. ఈనాడు మనం చిన్నచిన్న గ్రామాలలోని పిల్లలను "నీవు ఏమి చదువుకుంటున్నావు?" అని అడిగినట్లయితే తెలుగు చదువుకుంటున్నాను అని చెబుతారు. అంతే కాని నేను ఆంధ్రం చదువుకొనుచున్నాను అని ఎవరూ చెప్పరు. అనాదినుంచీ తెలుగు పదము చాల గౌరవప్రదమైనటువంటిది. ఆంధ్ర అనేది సంస్కృతపదం, తెలుగుఅనేది తెలుగుపదం. ఈ రెండింటికి అదే తేడా. అందుచేత ప్రభుత్వంవారు ఆలోచించి "తెలుగునాడు" అనో లేక తెలుగు ప్రదేశమనో పేరు పెట్టినట్లయితే చాలా బాగుంటుందని నాయభిప్రాయము.

తెలంగాణావారు వేరొకపేరు కావాలని కోరినట్లయితే మనం sacrifice చేసి ఆ పేరునే అంగీకరించి, వారి కోర్కెను ఎందుకు తీర్చకూడదు? ఈ విషయంలో మననాయకులు బాగా ఆలోచిస్తారని అనుకొంటున్నాను. మన తెలంగాణా నాయకులు regional councils కావాలని కోరుతున్నారు.

Regional councils ను తెలంగాణా నాయకులు కావాలని కోరుతున్నారు. అంతమాత్రంచేత మనం రెండో Council ను కోరడం సబబుకాదు. Regional council ను కోరడంలో వారుకూడా తప్పుదారిని పడుతున్నారనే నేను అనుకుంటున్నాను. ఎందుచేతనంటే, ఆ Council లేకపోయినప్పటికీ వెనుకబడిన ప్రాంతాలను బాగుచేసుకొనే బాధ్యత మన అందరిమీదవున్నది. వెనుకబడిన ప్రాంతాలవారు కొన్ని ప్రత్యేకమైన హక్కులుకావాలని కోరుతున్నారు. అసలు వారు కోరకుండానే దేశమంతాకూడా ఒకేస్థితిలోకి వచ్చేటట్లు చేయవలసిన అవసరము మనఅందరికీఉన్నది. అయితే వారు కోరుతున్నారు కాబట్టి వారికి Council ఉన్నంతమాత్రాన మనం రెండో Council పెట్టుకోకూడదని నా ఉద్దేశ్యం. Legislative Councils కావాలని చాలమంది నాయకులు చెప్పారు. బాగా చదువుకొన్నటువంటివాళ్లు, బాగా వ్యాపారం చేసేటటువంటివాళ్లు దీనిలో ఉండటానికి అవకాశంవుంటుంది. మనం assembly లో ఏ బిల్లు ప్యాసుచేసినప్పటికీ, వారు తిరిగి ఆ బిల్లునుచూచి దాని మంచిచెడ్డలగురించి మనకు సలహా చెప్పడానికి అవకాశం ఉంటుందని, చాలామంది చెప్పారు. ఈ సలహాకూడా బాగానేఉన్నది. కాబట్టి Legislative Council ఉండడం మంచిదనే నేను అభిప్రాయ పడుతున్నాను. Zonal Councils విషయంలో అది కేవలం మనదేశానికి నష్టదాయక

4th April 1956] [Sri P. Bapayya

మైనదనే నేను అభిప్రాయపడుతున్నాను. Bilingual రాష్ట్రాలు కావాలని ఏ విధంగా అయితే చెప్పారో, అట్లాగే ఈ భాషాప్రయుక్తరాష్ట్రాలకు Zonal Council పెట్టడంవల్ల చాలనష్టము వస్తుంది. కనుక ఈ Zonal Council విషయమై తిరిగి ఆలోచించవలసిన అవసరంఉన్నదని మనం కేంద్రప్రభుత్వానికి తెలియ పరచడం అవసరమేమోనని నేను అభిప్రాయపడుతున్నాను. కాబట్టి ఈ విషయంలోకూడా మన నాయకులను ఆలోచించవలెసిందని కోరుతూ నేను సెలవు తీసుకొంటున్నాను.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా మహాశయా! 3 రోజులనుంచీ రాష్ట్రపునర్విభజన బిల్లుపై చర్చ జరుగుతున్నది అనేకమంది పెద్దలు తెలుగుజాతి అంతాకూడి మనగల అవకాశంఇచ్చే ఈ బిల్లును చర్చించే మహద్భాగ్యం కలిగినందులకు చాల సంతోషిస్తున్నామనికూడా చెపుతున్నారు. కాని ఈనాడు అంతగా ఉబ్బితబ్బిబ్బు కావలసిన పరిస్థితులు ఏమీలేవేమోనని నేను భావిస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాతకూడా ఆంధ్రప్రజలందరూ మారుమూలల మ్రగ్గుచూ, ఏటికెొకరు, కోటికొకరుగా మద్రాసు, మైసూరు, ఒరిస్సారాష్ట్రాలలోఉండి పర పరిపాలనలోకూడా పడనటువంటి కడగండ్లుపడుచున్నవారిని మన దరిదాపుల కీడ్చుకుంటారని ఆశాదృక్కులతో మనవైపు చూస్తూఉండగా ఈనాడేదో విశాలాంధ్ర అనేపేరుతో ఒక రాష్ట్రంవచ్చిందని, ఆ రాష్ట్రంయొక్క బిల్లును చర్చించుకుంటు న్నామంటే మనం అంతగా ఉబ్బిపోవలసిన అవసరంలేదు. ఏనాడైతే ముక్కోటి ఆంధ్రులను ఒకత్రాటిక్రింద, ఒకజండాక్రింద నడిపించగల అవకాశం వస్తుందో ఆనాడు మనం ఉత్సాహంగాని, సంతోషంగాని పొందగలిగిన అర్హత మనకు వస్తుందని నేను మనవిచేసుకుంటున్నాను. అంతవరకూ మనము సంతోషపడవలసిన అవసరంకూడా లేదేమోనని నామవి. రాజధానిపేరు విషయంలో "విశాలాంధ్ర" అన్నా, మరే ఆంధ్ర అన్నప్పటికినీ, గానిని గురించి మనకేమీ సంతోషంలేదు. పూర్వం ఒక సామెతఉండేది "పచ్చికంకు, దాసరిఅంటే రాలినమట్టుకే గోవిందా అన్నాడట" అటువంటి పరిస్థితులలో ఈనాడు మనం ఉన్నాము. "ఎదోదొరికింది దొరికినంతవరకు తీసుకుంటే చాలురా మహదేవా" అని కొంతవరకు సంపాదించుకొని సంతోషిస్తున్నామేగాని సక్రమమైన సమగ్రాంధ్ర రాష్ట్రాన్ని మాత్రం మనము రాబట్టుకోలేదని నేను మనవి చేస్తున్నాను.

ఆంధ్ర రాష్ట్రానికి, ఆంధ్రజాతికి మహోజ్వలమైనటువంటి పూర్వగాథ ఉన్నదని మన పెద్దలందరూ చెపుతున్నారు. అంతేగాదు జాతిపిత అయిన మహాత్మాగాంధీ గారు సాగించినటువంటి స్వరాజ్య సమరంలో అగ్ర

Sri B. Rama Reddi] [4th April 1956

గాములుగా ఆంధ్రజాతి పేరుపొందింది. కాని ఏ విషయంవచ్చినా ఆంధ్రజాతి అల్లరిపాలు కాకుండా, రచ్చకెక్కకుండా ఏదైనా సంభవించిందా అంటే అది సర్వశూన్యం. అటువంటి అధ్వాన్నస్థితి ఆంధ్రజాతికి ఎందుకుగాను వచ్చిందో తెలియదు ఇందుకు కారణం ఆంధ్రజాతి దౌర్భాగ్యమా, లేక నాయకత్వలోపమా అనేటటువంటి విషయంకూడా అప్పుడప్పుడు స్ఫురిస్తూ ఉంటుంది. ఎప్పుడు ఎక్కడకు పోయినా అక్కడ స్వార్థరహితసేవచేత స్వీయప్రతిభా విశేషంచేత జాతి మన్ననలను పొంది ఇతను ఏకైకనాయకుడు అనిపించుకొని జాతిని నడిపించగలిగిన వాడు ఎవడైనా ఉన్నట్లయితే అతను "జాతి అంతా నావైపుఉంది నేనేమి చెప్పినా జాతి నావెంట వస్తుందనే ధీమాతో,, మాకు ఇదికావలె, ఇది లేక పోతే మేము ఒప్పుకోము" అని పైవారితో చెప్పగలిగె ధైర్యస్థైర్యాలు ఆయనకు ఉంటాయి. అది లేక సంకుచిత స్వభావాలతో, మురాతత్వాలతో వారిని వీరిని కలియబెట్టుకొని నాయకత్వం నిలబెట్టుకొని పైవారిదగ్గరకు జోకుహుందారుగా ఎవరుముందుకు పోవలెనన్న పరిస్థితి ఏర్పడినపుడు జాతికిగాని, సంఘానికిగాని కావలసిన కోర్కెలు నెరవేరవు, అని సవినయంగా నేను మనవిచేస్తున్నాను. గత ఎన్నికలలో ఐక్య కాంగ్రెసు అనే అపూర్వ నామధేయంతో అఖండ విజయాలను సాధించి, ఈనాడు విశాలాంధ్ర రాష్ట్రాన్ని సక్రమంగా సంపాదించుకోలేక పోతే ఇది జాతికి ఒక విధంగా కళంకప్రాయంగా ఉంటుంది. ఐక్య కాంగ్రెసు అనేపదాన్ని నేతిబీరకాయ అనే పదంతో సమంగా చేయవద్దని నాయకులందరికీ నమస్కార పూర్వకంగా చెయ్యెత్తి జోహారులర్పిస్తున్నాను. గౌరవనీయులైన కల్లూరు సుబ్బారావుగారు ఆంధ్రజాతియొక్క పూర్వచరిత్రను చెపుతూ దీనికి మహోజ్జ్వలమైన పూర్వచరిత్ర ఉన్నదని, ఆంధ్రజాతియొక్క పూర్వగాథ ప్రతిభా విశేషములతో కూడినదని ఆంధ్రనాయకులు వీరోచితంగా పోరాడి రాజ్యాలను సంపాదించుకున్నారనీ చెప్పారు. అప్పుడు నాకు ఒక సందేహం కలిగింది. మనకు చెప్పుకోతగినటువంటి భవిష్యత్తు లేక పోయినప్పుడు వెనుకటి గాథను చెప్పుకోడం పరిపాటి అని అంటూ ఉంటారు. అందువలన అటువంటి స్థితి మనకేమైన ఉన్నదా! అనే అనుమానంకూడా నాకు కలుగుతోంది.

తరువాత ఈ రాష్ట్రము పేరు గురించి నేను కొంత మనవిచేయ దలచుకొన్నాను. మనమేమో ఆంధ్ర దేశమును శ్రీ కృష్ణదేవరాయలు పరిపాలించినటువంటిదనీ, అతడు ఆంధ్ర-కర్నాటక రాజ్యరమా దురంధరుడని, ఆంధ్ర-కర్నాటక స్థాపనాచార్యుడని చెప్పుకొంటున్నాము. అటువంటి ఆంధ్ర-కర్నాటక రాజ్యంలోని మన ఆంధ్ర ప్రాంతాలన్నీకూడ సమగ్రంగా ఒక జండా క్రిందికి వచ్చినప్పుడు, తెలుగు

4th April 1956] [Sri B. Rama Reddi

నాయకుడని, తెలుగు రాజ్య స్థాపకుడని పేరు పొందిన ఆ మహా నాయకుడు కృష్ణ దేవరాయలు పేరుతోనే ఈ రాజ్యాన్ని స్థాపించుకొన్నట్లయితే ఆయన పేరును మన హృదయాలలో స్మరించుకొంటూ ఉండే రీతిగాచేసి వారియొక్క ఋణాన్ని తీర్చుకో గల భాగ్యముకూడ మనకు లభిస్తుందేమోనని అనుకొంటాను. కనుక పెద్దలైనటువంటి కోటిరెడ్డిగారు చెప్పినట్లు, మన రాష్ట్రముయొక్క పేరు "రాయలసీమ" అని పెట్టితే బాగుంటుందని నేనుకూడ భావిస్తున్నాను. దీన్ని గురించి, కొంత మంది సర్కారు సోదరులు వేరే భావము పడవచ్చు ఇది రాయలసీమ వారి సంకుచిత స్వభావమని చెప్పవచ్చు కాని, ఏ రాయలసీమవారైతే ఈ ఆంధ్ర కర్నాటకమును కటకు నుంచి కన్యాకుమారి వరకు విస్తారంచేసి, ఆంధ్ర-కర్నాటక స్థాపనాచార్యు డనే పేరు పొందినారో ఆ మహా నాయకునియొక్క పేరును స్మరించి ధన్యులై, వారియొక్క ఋణాన్ని తీర్చుకోనేదానికొరకై ఈ రాష్ట్రానికి "రాయలసీమ" అని పేరు పెట్టుకొనడమే సమంజసంగా ఉంటుందని చెప్పుచున్నాను. నిన్ననే పెద్దలు తెలంగాణా అనే పదము గురించి చెప్పారు. ప్రాంగణమన్నా అంగణమన్నా సీమ అనే పదము వస్తుంది కాబట్టి ఒక వేళ వారిని obuse చేయువలెననే పద్ధతిలో ఆంధ్ర అనేటటువంటి సంస్కృత పదమును తీసుకువచ్చి "ఆంధ్ర తెలంగాణ" అని చెప్పుతున్నారేమో అనుకొంటున్నాను. ఈ "ఆంధ్ర-తెలంగాణా" అనేది, మాల మాదిగ, కాపుకమ్మ, తురక దూదేకుల అనేటటువంటి రీతిగా ఉన్నట్లు నాకు తోచుచున్నది. ఆంధ్ర తెలంగాణా అంటే, ఆంధ్రులు, తెలంగాణా అని వేరు వేరుగా ఉంటూ వారి ద్వేషబుద్ధిని శాశ్వతంగా స్ఫురింప చేసినట్లవుతుందనుకొంటాను. కాబట్టి ఇటు రాయలసీమ పేరుగాని లేక, తెలంగాణా అను పదమునకు సరియైనటు వంటి తెలుగు అను వాదము "తెలుగుసీమ" అవుతుంది. కాబట్టి "తెలుగుసీమ" అనిగాని పెట్టినట్లయితే బాగుంటుందని, అది ఒక విధంగా వారినికూడ ఒప్పించినవా మవుతామని చెప్పుచున్నాను. ఆంధ్ర ప్రదేశ్ అని పేరు పెట్టేటటువంటి సూచన వున్నది. అయితే, ఆంధ్ర అనే ఒక సంస్కృత పదాన్ని "ప్రదేశ్" అనే మరొక భాష పదాన్ని కలిపి కలగాపులగం చేయడం బాగుండదనుకొంటాను. నాకు ఇంకొక భయముకూడ వున్నది. "ఆంధ్రానాం అనేకత్వం" అనే కీర్తి మనకు పట్టిందేమో అనుకొంటాను. కనుక ఈ "ఆంధ్ర" అనే శబ్దమైనా పోతే ఈ అనేకత్వం పోతుందేమో అనుకొంటాను. కాబట్టి రాష్ట్రమునకు "రాయలసీమ" అనిగాని లేక "తెలుగుసీమ" అని గాని పేరు పెట్టవలెనని ప్రార్థిస్తున్నాను.

రెండవది Legislative Council ఉండవలెనా లేదా అనే విషయం గురించి దీనికి వృధాగా డబ్బు ఎందుకు ఖర్చు పెట్టవలెనని కొందరు అంటున్నారు. కాని,

Sri B. Rama Reddi] [4th April 1956

చాలామంది పెద్దలు చెప్పినట్లు, కేవలం ఆత్మాభిమానం ఉన్నవారెవరూ ఈ election లో దిగరు. ప్రతిభా విశేషము కలిగినటువంటి పెద్దలందరూ election కొరకు ప్రజలను అడుక్కోలేక, వారిని భంగపర్చలేక ఇది మనకెందుకు అని సాధారణంగా ఊరుకుంటారు. అటువంటి వారిసేవ మనము తీసుకోవలెనంటె ఈ upper house అనేది ఉండడం మంచిదని నా అభిప్రాయము.

ఇక Regional Councils గురించి ఒక విషయం చెప్పుతున్నాను. మన ఆంధ్ర నాయకులకు అంతా అన్నలు ఉన్నారేగాని తమ్ములులేరు. ఈ అన్నగార్లంతా సమయము వచ్చినప్పుడు సున్నలు జుట్టి పంపేవారే. మనకు ఇప్పుడే అనేకమైనటు వంటి కష్టాలు సంభవిస్తున్నాయి. అటువంటప్పుడు ఈ Regional Councils వస్తే ఈ అన్నగారు తోడై మనకు ఇంకా కొద్ది ఎక్కువ కష్టాలు వస్తాయేమో అనుకొంటాను. కాబట్టి రంగనాథ ముదలియార్ గారు చెప్పినట్లు, అక్కడా తెలుగే, ఇక్కడా తెలుగే అయినప్పుడు ఈ Regional Councils యొక్క అవసరంకూడ ఉండదేమో అని నేను భావిస్తున్నాను కనుక అటువంటిది ఉండకూడదని మనవి చేస్తున్నాను.

ఇక, మనము పోగొట్టుకొనిన ఆంధ్ర ప్రాంతముల గురించి, బళ్ళారి విషయం తీసుకొందాము, ఆంధ్ర, కర్నాటకములను సమ్మేళనంచేసి ఆంధ్ర కర్నాటక స్థాపనా చార్యుడని పిలువబడు శ్రీ కృష్ణదేవరాయలు, వారియొక్క వీర రక్తాన్ని ధారపోసి నిర్మించినటువంటి హంపియొక్క శిధిలాలు ఉన్న బళ్ళారి హాస్పేట్ మొదలగు వాటిని పోగొట్టుకొంటున్నాము అంటే, దాన్నిగురించి విచారించ వలసా, అది ఆంధ్ర జాతికి కళంకముకాదా, దీన్ని గమనించలేరా అని మనవారిని హెచ్చరిస్తున్నాను. Platforms మీద ప్రచారం చేయడం, రక్తదానం చేయడం మాత్రమే మనకు అలవాటైపోయింది. అవసరం వచ్చినప్పుడు మాత్రము వేదాంతాలు చెప్పుతూ ఉంటారు. మనము ఏదైనా పోగొట్టుకొన్నప్పుడు ఏమిచేయవలసియున్నది, అనేదానికి మన జాతి పిత మహాత్ముని ఆదర్శమున్నదని పెద్దలు చెప్పినారు. మనము శాంతి ప్రియులము. ఆంధ్ర జాతి శాంతి ప్రభుత్వముతో ఉండేది కాబట్టి ఓర్చుకోవలసింది, పోగొట్టుకోవలసింది అంటారు. ఇంక మనకు మిగిలేది వేదాంతమే, ఇది శుష్క వేదాంతము, మన పెద్దలపేరు చెప్పుకొని, మన పెద్దలయొక్క జాతిని చెప్పుకొంటూ వారి కీర్తిని చెప్పుకొంటూ పెద్దలయొక్క త్యాగాలు పొగడు కొంటూ ఉంటే దానికంటే మేముకూడ త్యాగులము, మాకు కావలసింది, ఇతరులు సంపాదించుకొన్నట్లే, సంపాదించుకొంటాము, మేము కూడా ధీరోదాత్తులము అని మనశక్తి సామర్థ్యములన్న

చూపించవలసి యుంటుంది. మన ఆంధ్ర కర్నాటక స్థాపనాచార్యుడైనటువంటి కృష్ణదేవరాయలు స్థాపించినటువంటి ఆంధ్ర రాష్ట్రమే కాదు, హంపి శిథిలాలు ఉన్నటువంటి బళ్ళారి నే కాదు, రాయలసీమకు జీవకర్రగా ఉన్నటువంటి తుంగభద్రా High level canal ను, ఆ జలాలను మనము సంపాదించుకోవలసియుంటుంది. తెలంగాణా వచ్చినందువల్ల, ఇప్పుడే రాయలసీమకు ఇది ఒక గుదిబండగా ఉంటుందేమో అని భయపడుతున్న సమయములో పోనీ తుంగభద్రా జలాలైన వస్తే, బాగుంటుందేమో అనుకొంటే, ఈ తుంగభద్రా జలాలుకూడ లేకుండా పోయినట్లయితే, ఈ రాయలసీమపై ఉండేటటువంటి సీతకన్ను ఎప్పటికికూడ పోదేమో అనే అనుమానం కలుగుతుంది. కనుక మనము బళ్ళారి కొరకు తప్పకుండా పోరాడి దానిని సంపాదించడానికిని, అంతే కాదు, మారు మూలల్లో ఉండేటటువంటి అన్ని ఆంధ్ర భాగాలను మన జెండా కిందికి తీసుకువచ్చే దానికొరకు ఈ శుభసమయమున, ఒక ధీరోదాత్తమైన ప్రతినబట్టి వాటి నన్నిటిని సంపాదించేవరకు మేము పోము అనేటటువంటి ధీమాతో పట్టుబట్టి వాటిని సంపాదించవలెనని మనవిచేస్తున్నాను.

తరువాత ఇంకొక్క విషయము మాత్రము మనవిచేయదలచుకున్నాను. అక్టోబరు మొదటి తేదీకి అక్కడికి పోతూ ఉన్నాము. అక్కడ పెద్ద ఉత్సవాలు చేయదలచుకొన్నాము ఈ శుభతరుణంలో ఒకటిచేస్తే బాగుంటుందనుకొంటాను. అక్కడక్కడ గవర్నరు నిధి అని, Prime Minister నిధి అని, ఇంకా ఏవేవో పెడుతున్నారు. మనముకూడ Chief Minister నిధి అని ఒకటి పెట్టి, దానికి మంత్రులందరూ ఒక నెలజీతమో లేక కొద్దిగానో ఇచ్చి, అదే విధముగా శాసన సభ్యులు కూడా దానికి కొంత విరాళాలు ఇచ్చి, ఆ నిధినుంచి అనాథులకు, పతితులకు, అన్నార్తులకు, అవసరమైనప్పుడల్లా ఇచ్చేటటువంటి ఏర్పాటు చేయవలసిందని నేను ప్రార్థిస్తూ ఈ అవకాశము ఇచ్చినందుకు అధ్యక్షులవారికి వందనాలు అర్పిస్తున్నాను.

SRI C. SUBBARAYUDU :—అధ్యక్షా, ఆంధ్రుల చిరకాల వాంఛ ఇప్పటికి కొంతవరకు నెరవేరింది, ఆంధ్రులు ప్రజా ఉద్యమాలలో తోటి రాష్ట్రాలలో ఎవరితోకూడ తీసిపోరు అనేటటువంటి సంగతి అందరికీ తెలిసినటువంటి విషయమే. అవసరం వచ్చినప్పుడు, ఏ త్యాగాలైనా చేసి వారు అశించునటువంటి, వారు న్యాయమని భావించేటటువంటి వాటిని నెరవేర్చుకొనేటటువంటి శక్తి సామర్థ్యములు కలవారు ఆంధ్రులు, అనే సంగతి యావద్భారత దేశానికి తెలుసు. మనము ఆంధ్ర రాష్ట్రము సాధించినటువంటిదే దానికి తార్కాణము. అటువంటప్పుడు ఆంధ్రులు ఏ దృష్టితో, ఏ దృక్పథముతో, విశాలాంధ్ర గురించి, ముక్కోటి ఆంధ్ర

Sri C. Subbarayudu] [4th April 1956

ప్రజలు ఏకమై ఒకే రాష్ట్ర ప్రభుత్వము క్రింద ఒకటిగా ఉండడానికోసం ఈ ఉద్యమాన్ని ప్రారంభించి, ఇంతకాలమూ ప్రయత్నం చేశారో, అది ఈనాడు నెర వేరిందా లేదా అనేది మనము ముఖ్యంగా ఆలోచించవలసియున్నది.

మనమే కాదు, ప్రతిఒక్కరూ కూడ యీనాడు ఆలోచిస్తున్నారు. ఒకవైపున సంతోషము, ఇంకొకవైపున విచారము ప్రజలలో ఏర్పడ్డది. మనము ఆశించినవిధముగా మనకు విశాలాంధ్ర ఏర్పడలేదు అనే విచారము ఎక్కడ చూచినా ప్రజలలో కన్పిస్తున్నది. అందులో ముఖ్యంగా సరిహద్దురాష్ట్రాలలో ఏఏ ప్రాంతాలలో ఆంధ్రప్రజలు ఎక్కువ మెజారిటీలో ఉన్నారో, అవి మన ఆంధ్రలోనికి న్యాయముగా రావాలని కోరుతూఉన్నాము. వేటికొరకైతే మనము ఆందోళన సాగిస్తూవచ్చామో, అవి మనకు రాకుండా, బైటరాష్ట్రాలలోనే ఉంచ బడినవి. అవి మనకు రాకుండాపోవడమునల్ల ఆంధ్రప్రజలందరికి చాలా విచారకరంగా ఉన్నది. ఆ ప్రాంతాలు అన్నీ ఆంధ్రలో చేరేటంతవరకు ఆ ప్రాంతాలలో ఉండే ఆంధ్రులుగాని, వారికొరకు తహతహలాడే యిక్కడ ఆంధ్రులుగాని ఆందోళననుంచి విరమిస్తారని మనము అనుకోలేము.

నూతనముగా ఏర్పడబోయే రాష్ట్రమునకు నామకరణముచేసే విషయములో "ఆంధ్ర" అని మనము అంటూంటే, "ఆంధ్ర-తెలంగాణా" అని హైదరాబాదు వారు అంటున్నారు. నూతనరాష్ట్రానికి ఏ పేరు పెట్టినప్పటికినీ ఉభయప్రాంతాల వారూ కలిసిపోయినతరువాత ఉభయులమూ కూడ యింతటితో తృప్తిపడి కూర్చో కుండా, మిగిలిపోయిన ఆంధ్రప్రాంతాలను మనలోకి తెచ్చుకోటానికి ఒక్కుమ్మడిగా కృషిచేయవలసి ఉంటుంది. మైసూరు రాష్ట్రములోవున్న కోలారు ఆంధ్రులు కానివ్వండి, సేలముజిల్లాలోఉండే కృష్ణగిరి, హోసూరు ఆంధ్రులు కానివ్వండి, చిత్తూరు జిల్లాలో సరిహద్దు తాలూకాలలో ఉన్న ఆంధ్రులు కానివ్వండి, పర్లాకిమిడివగైరా ప్రాంతాలలోఉన్న ఆంధ్రులు కానివ్వండి, ఏఏప్రాంతాలు మనకు రాలేదో అక్కడ ఉన్న ఆయా ఆంధ్రులనందరినీ మనము చేరదీసుకున్ననాడే మన చిరకాలవాంఛ నెరవేర్చుకున్నవారమవుతాము. అప్పటికిగాని ఆంధ్రులయొక్క బాధ్యతలు తీరి పోవు. దురదృష్టవశాత్తూ యీనాడు అది జరగలేదు. మనలోవున్న బళ్ళారి, దాని సరిహద్దుతాలూకాలను తుంగభద్రతోసహా తీసుకొనివెళ్ళి మైసూరులో అన్యాయముగా కలిపివేశారు. వాటిని తిరిగి యిచ్చివేయమని ఆందోళన చేసినను, దానిప్రసక్తియీ రాలేదు. కేవలము విశాలాంధ్రకోసము మనము సాగించిన ఉద్యమములో తెలంగాణాలో ఉన్న నాయకులు కానివ్వండి, అక్కడప్రజలు కానివ్వండి వారికి ప్రత్యేకంగా రాష్ట్రము కావాలనే

వాదన లేవదీయడములేదు మన ఆంధ్రులకందరికి ఒక్కటే విశాలాంధ్ర ఏర్పాటు చేయమని మనము యిక్కడ ఆందోళనచేయడము యిది అంతా జరగడములోనే ఎక్కువకాలము మనము వృధాచేసినామేమోననే సందేహముమాత్రము నాకు కనబడుతున్నది. ఈ విధముగా కాలము వృధాచేసేదానికంటె మనము, మన నాయకులు మన ఆంధ్రులనందరినీ ఒకచోట చేరదీసుకోటానికే ముందు ప్రయత్నించిఉంటే మనకు యీనాడు ఏర్పడిన దురదృష్టకరమైన యీ పరిస్థితులు ఏర్పడి ఉండేవి కావేమో నని నాయొక్క వ్యక్తిగత అభిప్రాయము. ఉదాహరణకు బళ్లారివిషయం చూడండి. పూర్వంనుంచి బళ్ళారిజిల్లా మనలో ఉండేది. అది మనలోనుంచి విడదీయబడ్డది. దీనివల్ల అక్కడవున్న ఆంధ్రులు ఎంతయిబ్బంది, ఎంత నష్టము పడుచున్నారో గుర్తించవలసియున్నది. వారిని మన మధ్యనుంచి విడదీయడము అన్యాయము, అక్రమము. ఇది చాలా విచారకరమైన విషయము. ఆనాడు కేంద్రప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన కమిటీలు బళ్లారివిషయము కూలంకషంగా విచారణచేసి ఆంధ్రులు, కర్నాటకులు చెప్పినవాదనలను వినడము జరిగింది. ఈకమిటీలకు అధ్యక్షస్థానము వహించిన మిశ్రాగారు కానీయండి, వాంఛూగారు కానీయండి, ఉభయులూ కూడా ఉభయపక్షముల వాదనలు సమగ్రంగా పరిశీలించారు. తుంగభద్రప్రాజెక్టును గురించి దానియొక్క సాధకబాధకాలు ఉభయరాష్ట్రములకు సంబంధించిన ఇంజనీర్లు చెప్పగా విన్నారు. నాకు తెలిసినంతవరకు యీ విచారణ అయినతరువాత చివరకు తుంగభద్రబోర్డును నిర్మాణము చేయడము జరిగింది. ఇన్ని జరిగినతరువాత గూడ కమిటీవారి రిపోర్టులో "After serious consideration" అనే పదములు ఉపయోగించినప్పటికినీ, బళ్లారినిగురించి కమిటీవారు చేసిన సిఫార్సులను కేంద్రప్రభుత్వమువారు ఒప్పుకోలేదంటే ఇంతకంటే దురన్యాయము వేరే ఉన్నదా అని అంటున్నాను. ఇన్ని ప్రయత్నములుచేసినను బళ్లారిని మరల మనము సాధించుకోలేకపోయినామంటే యిది ఎవరియొక్క లోపమో మనము విచారించుకోవలసియున్నది. మన లోపమా? లేక కేంద్రప్రభుత్వముయొక్క లోపమా? ఇది ఎవరిలోపమో ఆలోచించవలసిన విషయమే. మనకు వీలు అయినన్ని ప్రయత్నములు లెక్కలు వగైరాలు కమిటీవారికి అందజేసి బళ్లారి మనకు రావలసియున్నదని ఋజువుచేశాము. ఇందులో మనలోపమేమాత్రమూ లేదు. కమిటీవారుచేసిన సిఫార్సులు ఒప్పుకోకపోవడము కేంద్రప్రభుత్వమువారి లోపమని చెప్పకతప్పదు. ఇది చివరకు ఏవిధముగా పరిష్కారము అయినప్పటికినీ బళ్లారిని దాని సరిహద్దు తెలుగుతాలూకాలు, తుంగభద్రప్రాజెక్టు ప్రాంతము ఆంధ్రలో చేరేవరకు, అక్కడ ఇక్కడ ఉన్న ఆంధ్రులు ఏమాత్రము నిద్రపోరు అని నేను హెచ్చరిస్తున్నాను. ఎవరు ఏలోపముచేసిననూ, బళ్లారి విషయంలో మన ఆంధ్రులలో ఒక్క విషయంమాత్రం వ్యాపించింది. కొంతవరకు

మన పార్టీలనాయకులవల్ల కానివ్వండి, పార్టీలో ఉన్న అనైక్యతవల్ల కానివ్వండి, బళ్ళారి విషయములోమాత్రము చేయవలసిన పూర్తిప్రయత్నములు మన కాంగ్రెసు నాయకులుచేయక నిర్లక్ష్యముచేశారని ఖచ్చితముగా చెప్పకతప్పదు. ఈ విషయములో చేయవలసిన ప్రయత్నమంతా చేయకపోవడంవల్లనే, దీనిని మనము సాధించుకోలేక పోయాము. అది మన లోపము అని ప్రజలలో అభిప్రాయము కలిగింది ఈనాడు బొంబాయి నగరము కేంద్రప్రభుత్వమువారి చేతిక్రిందకు తీసుకుంటూ వున్నారంటే అది ఏకారణముచేత తీసుకుంటూవున్నరో దానికి కారణం వేరే వున్నది. కేవలం భాష అనే కారణముకాకుండా ఆర్థిక వ్యవస్థను గురించి కూడ కేంద్రప్రభుత్వము ఆలోచించి ఆ విధంగా చేస్తూవుండవచ్చు. కాని బళ్లారి విషయం మాత్రము ఆ దృష్టితో ఆలోంచించనక్కరలేదు. బొంబాయిగూడ ఒక పెద్ద పట్టణముకావచ్చు. దానికి పెద్ద ప్రాధాన్యముగూడ వుండవచ్చు. బొంబాయి ఏ పరిస్థితులలోవున్నదో ఆ పరిస్థితులలోనే, ఈనాడు బళ్లారిగూడ వున్నది. బళ్లారి, దాని పరిసర తెలుగు ప్రాంతాలలో ఏర్పడిన ఆర్థికదుస్థితి వల్ల అక్కడ ప్రజలందరు యిప్పటికే చాలామంది విడిచిపెట్టి పోవటము తటస్థించింది. ఈ బిల్లువచ్చిన తరువాతగూడ అక్కడవున్నవారివల్ల ఇంకా ఎక్కువగా ఆందోళన జరుగుతున్నది. చాలమంది ప్రజలు, బళ్లారినుంచి బయిటికి వెళ్ళి పోవటానికి ఏర్పాట్లు చేసుకుంటున్నారు. బళ్లారి, కర్ణాటకులకు చేరకముందు, అక్కడవున్న ఒక్కొక్కయిల్లు 30, 40 వేలు చేసేదిగాని, ఒక్కొక్క ఫ్యాక్టరీ లక్షలకొలది చేసేదిగాని, అమ్మకానికి పెట్టగా, అవి కొనటానికి అడిగేదిక్కులేకుండాపోయింది. దీనివల్ల అక్కడవున్న ఆంధ్రులు ఆర్థికంగా ఎన్నో కష్టనష్టాలకు, యిబ్బందులకు గురిఅవుతున్నారో చూడండి. బళ్ళారి, దాని పరిసర తెలుగు ప్రాంతాలు ఆంధ్రప్రాంతమునుండి ఎప్పుడైతే, శాశ్వతముగా, విడదీయడము జరుగుతుందో ఆనాడు, ఆ ప్రాంతాలన్నీ ఒక శ్మశానభూమిగా ఏర్పడడం తటస్థిస్తుందని నేను చెప్పగలను. అంతేకాకుండా అక్కడవుంటే తెలుగు గ్రామాలన్ని తప్పక దెబ్బతింటాయి. ఎందుకంటే బళ్ళారిలోని ప్రజలకు, ఏ సమయములోనైనా 10 రూపాయిలు కావాలన్నా ఏ వస్తువు కొనుక్కోవాలన్నా, అమ్ముకోవాలన్నా వీలులేకుండా ప్రజలు యిబ్బందిపడుతున్నారు. బళ్ళారిజిల్లా అంతయు పూర్వమునుంచీ ఆంధ్రులచేతులలో వున్నందున అది ఒక వ్యాపారకేంద్రంగా అయినది. అటువంటిది ఈ విభజనవల్ల, వాళ్ల పెట్టుబడికి సరాఫరా లేకపోవటం వల్ల వారి వ్యాపారం దెబ్బతిన్నది. కాబట్టి ఇటువంటి పరిస్థితులలో మన ఆంధ్ర నాయకులు, ఇప్పుడైనాసరే మేలుకొని వాటిని మన ఆంధ్రప్రాంతములో చేరదీయటానికి తగుశ్రద్ధ తీసుకోవాలని మనవి చేస్తున్నాను.

హైకోర్టు విషయము చూస్తే మన తెలంగాణా సోదరులు సర్కారాంధ్రులకు గాక, వేరే హైకోర్టుబెంచి గుంటూరులోనే పెట్టుకోవలసిందిగా సలహాయిస్తున్నారు. రాయలసీమలోని మూడుజిల్లాలవారిని హైదరాబాదు హైకోర్టుకు రమ్మని సలహా యిస్తున్నారు. ఈ విషయంలో వారి సిఫారసును మనము పాటించనక్కరలేదు. ప్రభుత్వము దయచేసి దీనికొరకు మాత్రము ప్రయత్నము చేయవద్దని కోరుతున్నాను. రాయలసీమవారు దీనికి ఎవరూ ఒప్పుకోరు. రాయలసీమజిల్లాలు కేసులు ప్రస్తుతం వున్న ప్రకారమే జరగటం న్యాయమని, సబబుఅని అంటున్నాను. హైదరాబాదు రాజధాని నగరము అయినప్పుడు, తెలంగాణావారికి అవసరంవస్తే వారే వేరేబెంచి హైదరాబాదులోనే పెట్టుకోవచ్చు. ఇది న్యాయసమ్మతముగాను, ధర్మముగాను వుంటుంది. అంతేగాని, మనకు హైదరాబాదు హైకోర్టుతప్ప, ప్రత్యేకబెంచి అవసరంలేదు. ప్రభుత్వము ఆ విధంగాచేస్తారని ఆశిస్తున్నాను.

నూతన రాష్ట్రానికి, "ఆంధ్ర తెలంగాణా" అని పేరుపెట్టారు. ఇది ఏ మాత్రము, బాగుగలేదు. ఒక రాష్ట్రానికి రెండుపేర్లు పెట్టడమనేది న్యాయ సమ్మతముగాదు. హాస్యాస్పదముగా వుంటుంది. మనమందరము ఆంధ్రులమే గనుక ఆంధ్రప్రదేశ్, అనిగాని, "తెలుగుప్రదేశ్" అనిగాని ఒక్కపేరుపెడితే బాగుం టుంది. అది నా వ్యక్తిగత అభిప్రాయము.

ఇకపోతే Zonal committees విషయంవున్నది. ఇందాక ప్రగడ కోటయ్య గారు చెప్పినట్లుగా ఏఏ ప్రాంత్యాలు అయితే వెనుకబడివున్నవో ఆ ప్రాంతాలకు వసతులు కలుగజేయడానికి ఈ Committeeలు పెడితే వుపయోగముగా వుంటుంది. అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందుకు వారికి నా అభివందనములు తెలియజేస్తున్నాను.

Sri C. P. THIMMA REDDI :—అధ్యక్షా, విశాలాంధ్ర ఏర్పడ నున్న యీ శుభ సమయములో, మన ఆంధ్ర నాయకులు చేసిన కృషి ప్రధానమై నప్పటికినీ, మనకు రావలసినదంతా రాకపోయినప్పటికినీ, ఏదో కొద్దిగానైనా వచ్చిందని సంతోషపడుతున్నాను. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడే యీ సమయములో భగవంతుడు మనకు విశాలాంధ్ర ఏర్పాటు చేయుచున్నందులకు భగవంతునికిన్నీ, దీనికొరకు కృషిచేసిన పెద్దలకున్నూ నా కృతజ్ఞతను తెలుపు తున్నాను. ఒకరు హీనస్థితిలో ఉంటే, యింకొకరు ఉన్నత స్థితిలో ఉండడము ప్రకృతి లక్షణము. కష్టసుఖాలు, సుఖ దుఃఖాలు ఒకరిని విడచి ఇంకొకరికి ప్రాప్తిస్తూఉంటాయి ఇదంతాకూడా ప్రకృతి లక్షణం. అలాగే దినములో ఒకప్పుడు రాత్రివస్తే యింకొకప్పుడు పగలు రావడము జరుగుచున్నది. అట్లాగే ప్రకృతికూడ

Sri C. P. Thimma Reddi] [4th April 1956

స్వాభావికంగా మారుతూ ఉంటుంది. ఈ సమయములో మనకు భాషా రాష్ట్రాలు ఏర్పడుతున్నవి అంటే, ప్రస్తుత పరిస్థితులకనుగుణముగా మనకు యిది సంభవించిందన్నమాట. భాషా రాష్ట్రాలకొరకు మన పొట్టి శ్రీరాములుగారు తన ఆత్మ బలిదానము చేశాడు. దైవిక శక్తివల్లనైతేనేమి, లేక శ్రీరాములుగారి ఆత్మశక్తివల్లనైతేనేమి మనకు తెనుగు భాషా రాష్ట్రము లభించిందని అనుకోవలసి వున్నది. అదే విధముగా మనకు స్వాతంత్ర్యము లభించిందంటే అది దైవికమువల్ల అనండి, లేదా గాంధీ మహాత్ముని ఆత్మ శక్తివల్లనేననండి, మనకు లభించిందని, తెలుసుకోవలసి ఉన్నది. గాని, మనకు కత్తులు, కఠారులు, మందు గుండు సామగ్రి ఉన్నందువల్ల అది లభించిందికాదని మాత్రము గుర్తించాలి భాషా రాష్ట్రాలు మనకు మంచి శాంతి యుతమైన పరిస్థితులలో ఏర్పాటు అవుతున్నవి.

దైవికంగా వచ్చిన ఈ పరిస్థితులలో ప్రాంతీయాభిమానాలుగాని, సంకుచిత భావాలుగాని లేకుండా విశాలమైనదృష్టితో ఈ చిన్న చిన్న విషయాలను సర్దుబాటు చేసుకోవడం మంచిది. ఇక ఆంధ్ర తెలంగాణా అని నామకరణం చేయాలన్నప్పుడు రెండూ తెలుగుప్రాంతాలే కాబట్టి, ఆంధ్ర తెలంగాణా అనేపదంలో పునరావృత్తి దోషం ఉన్నది, కాబట్టి ఆ విషయం ఉభయప్రాంతాలనాయకులూ సంప్రదించి నిర్ణయించాలని మనవిచేస్తున్నాను. ఎన్నో మంచిపేర్లున్నాయి. నవ్య ఆంధ్ర అని పేరుపెట్టవచ్చును లేదా ఆంధ్రప్రదేశ్ అని పెట్టుకోవచ్చును లేదా తెలుగునాడని పెట్టుకోవచ్చును. కాని పెట్టేపేరు సమంజసంగా, శాస్త్రీయయుక్తంగా ఉండాలి. మనదేశ ధర్మాన్ని అనుసరించి జన్మనక్షత్రాన్నిబట్టి పేరుపెట్టడం పరిపాటి. ఈ రాష్ట్రం ఎట్లాపుట్టిందో చూసిపెట్టినా బాగానేవుంటుంది. నా వ్యక్తిగతంగా చెప్పవలసివచ్చినప్పుడు దీనికి రామరాజ్యం అని పేరుపెడితే బాగుండునేమో అనిపిస్తోంది నాకు. రామరాజ్యం అంటే ప్రజాస్వామ్యరాజ్యం అని అర్థం. "రమయతీ రమంతే అస్మిన్ ఇతి వా రామః" ఇదీ రామా అనేపదానికి అర్థం, దశరథకుమారుడు రాముడని అర్థంకాదు. లేదా ఇంకోపేరుతో రాముడనికాదు. "రమయతీ, రమంతే అస్మిన్ ఇతివారామః" అంటే అర్థమేమిటంటే అందరిలోఉండి రమింపజేసేవాడు, అందరినీ తనలోపెట్టుకుని రమింపజేసేవాడని అర్థం. అంటే రామ అనేపదానికి ప్రజాస్వామ్యం అని అర్థం అంతే. రామరాజ్యం అంటే "ప్రజాస్వామ్య గవర్నమెంటయ్యా" మాది అని చెప్పుకునేదానికి. అదిగాక తెలంగాణాకూ, మనకూ మధ్య భద్రాద్రి శ్రీరాములు ఉన్నారు. ఆయనవారికీ మనకూకూడా ఆరాధ్యదైవంగా ఉంటున్నారు కాబట్టి ఆయనపేరని అనికోవచ్చును. ఈ పొట్టిశ్రీరాములుగారి ఆత్మబలిదానంవల్ల వచ్చినరాష్ట్రం కాబట్టి వారిపేరని

అనుకోవచ్చును. అదీకాకుండా గాంధీమహాత్ముడు భౌతికశరీరాన్ని వదులుతూ "రామ్, రామ్" అని సందేశం అందజేస్తూపోయారు. కాబట్టి దానికి అనుగుణ్యంగా మనం ఈపేరు పెట్టుకోవచ్చును. నేను ఏదో శాసాలు మాట్లాడుతున్నానని మీరు అనుకోవచ్చును. ఒక పేరుపెడుతున్నామంటే అందులోనేఉంది, గొప్పతనం. ఎవరికైనా మంచివాడంటే, ఆయన మంచిగా ఉండటానికి ప్రయత్నంచేస్తాడు. అందుకనే రామరాజ్యం అని పేరుపెట్టుకుంటే, అందులో కొన్ని అవక తవక లున్నా, అది రావణరాజ్యం కాకుండా పోతుంది. ఒకవేళ రామరాజ్యంకాకపోయి నప్పటికీ, అందువల్ల ఈ పేరుపెట్టే విధానంలో అందరూ కూర్చుని సమన్వయం చేసుకుని ఏదో నిర్ణయానికి వస్తారని ఆశిస్తున్నాను. ఇంక ఈ Boundry విషయంలోచెప్ప వలసివచ్చినప్పుడు ముఖ్యంగా నేను చెప్పవలసింది బళ్ళారి విషయం. బళ్ళారి విషయం చెపుతూఉంటే నాకు ఒక సంగతి జ్ఞాపకం వస్తున్నది. 'Back' అంటే Backward Districts ఏవయ్యా అంటే Ceded Districts అని అనుకుంటే వాళ్ళం ఇందులో రవ్వంత ఉత్తమమైనది మొదటిది B అనే అక్షరంతో ప్రారంభమయ్యేది Bellary అని, రెండవది A తో ప్రారంభం అయ్యే, Anantapur అది, మూడవది C తో. ప్రారంభించేది Cuddapah అని, K తో ప్రారంభమయ్యేది Kurnool అని ఈ విధంగా అనుకుంటూ ఉంటారు. అందులో B అనగా బళ్ళారి తీసిపారేస్తే తలకాయ ఎగిరిపోయినట్లే. తలకాయ లేని శరీరం ఎందుకు అక్కరకు వస్తుంది? అన్నిటికన్న ప్రధానమైనది తలకాయ కాబట్టి, తలపోతే మిగతాది మొండెం మాత్రమే మిగులుతుంది కాబట్టి తలకాయ అనగా బళ్ళారిని మళ్ళీ పెడితే, జీవంపోసినట్లవుతుంది. ఒకటి వేసి ఎన్ని సున్నలు చుట్టినా విలువ ఉందికాని, ఒకటి లేకుండా ఎన్ని సున్నలు చుట్టినా విలువ ఎట్లాలేదో అట్లనే ఈ B అనగా Bellary ని సెయ్యడం చాలా పెద్ద దెబ్బతో. కాబట్టి పెద్దలైనవారు ఈ విషయమై శ్రద్ధవహించి, Boundry తగాదాలపై, సంఘాలు ఏర్పాటుచేయబోతున్నారు కనుక, ఈ సమస్య విశాలదృష్టితో పరిశీలించి న్యాయంచేస్తారని నమ్ముతున్నాను. Legislative Councils ఉండడంమంచిదనిపిస్తున్నది. బిచ్చగాడు ఎప్పుడూదాతకాడని ఒక శాస్త్రంఉన్నది. మనం అందరి దగ్గరకు పోయి అడుక్కుంటాంకాబట్టి వీళ్ళకు స్వతంత్రాలోచన లేదని చులకనగా చూస్తారు ఈ ప్రజాస్వామ్యంలో ప్రజలు వివేకవంతులై విమర్శనాజ్ఞానం కలిగియున్నప్పుడే, దానికి అనుగుణమైన సలహాలు ఇచ్చినప్పుడే అది సరియైన పంథాలో నడుస్తుందికాని, ఎవరికి వారు స్వార్థంకోసం చూచుకుంటే దేశమే నాశనమైపోతుంది. కాని జ్ఞానవేత్తలైన పెద్దలు కొందరు, అనుభవశాలులైనవారు Legislative Council లో యుండి సలహా ఇవ్వడం

చాలా బాగుంటుంది. హైకోర్టు విషయం వచ్చినప్పుడు, Capital ఎక్కడుంటే అక్కడే అది ఉండడం మంచిగి. ఎక్కడ హైకోర్టు ఉంటుందో అక్కడ ఈ యుగంలో విజ్ఞానవేత్తలుగా పరిగణింపబడుచున్న Vakils ఉంటారు. వారి వల్ల ఆ స్థలానికి Prestige ఉంటుంది. కాని High Court వేరేస్థలంలో యుంటే దానికి విలువఉండదు మా కర్నూలును కందనవోలు అంటున్నారు. ఎందుకంటే హైదరాబాదుపోతూ పోతూ ఇక్కడ కందెనవేసేదట. ఇక్కడ నుంచి చలో హైదరాబాద్ అంటున్నప్పటికీ కొన్ని కోట్లు రూపాయిలు ఇక్కడ ఖర్చుచేశారు కాబట్టి, హైదరాబాదునుంచి రాయలసీమకు వెళ్ళేదారిలో ముఖద్వారంవలె ఉన్నటువంటి ఈ కర్నూలు పట్టణంయొక్క అభివృద్ధిని మరవకూడదు. ఇక్కడ Medical College పెడతామంటున్నారు. కాని ఇంతవఱకూ ఏమీ జరగలేదు. ఇక్కడి ప్రజలకు కర్నూలు neglect చేయబడుతుందని భయముగా యున్నది. వెనుకపడిన ప్రాంతాలను దృష్టిలో పెట్టుకుని తెలంగాణావారు అడిగిన హామీలన్నీ ఎల్లా ఇచ్చారో, ఆ చిన్నతమ్ముణ్ణి ఎల్లామాచి అలని భాగం అతనికి ఎలా ఇస్తున్నారో, అట్లాగే పెద్ద తమ్ముడికికూడా అంతే భాగం ఇస్తే న్యాయంగా ఉంటుంది. పెద్ద రాష్ట్రం అవుతోంది కాబట్టి మళ్ళీ Leadership వగైరాలను గురించి గలాటాలేకుండా, శాంతియుతంగా సక్రమమైన పంథాలో సమస్యలనన్నీ పరిష్కారం చేస్తారని నమ్ముతున్నాను.

THE HON. DR B. GOPALA REDDI·—అధ్యక్షా, ఈ మూడు దినాలుగా సభ్యులుచేసిన ఉపన్యాసముల సారాంశం మొత్తంమీద అనుకూల వ్యతిరేకతల మధ్యనే ఉన్నది. అనుకూలంగా ఉన్న విషయాలనుగురించి అట్టే ఎక్కువ చెప్ప నక్కరలేదు. ప్రతికూలంగా ఉన్నటువంటి విషయాలలో సుందరయ్యగారు వారి కెక్కడెక్కడ వ్యతిరేకతవున్నదో సమగ్రంగా చెప్పినారు. తరువాత మాట్లాడినటువంటివారుకూడా యించుమించు అదే ధోరణిలో మాట్లాడినారు ఇక సుందరయ్యగారి ఉపన్యాసంలోగాని వ్యతిరేకంగా మాట్లాడినటువంటివారియొక్క ఉద్దేశంలోగాని యీ zonal councils, regional committees నిర్మాణం రెండుప్రాంతాలకు ఇక గవర్నరును పెట్టడం, రెండుప్రాంతాలకు ఒక High court పెట్టడం, యివన్నీకూడా వారు వ్యతిరేకించినారు. తరువాత Upper House అక్కరలేదన్నారు. తరువాత election విషయం చెప్పినారు. ఈ zonal councils విషయమై చెప్పినటువంటి అనుమానాలు సందేహాలు చెప్పినటువంటి వారియొక్క విషయంచూస్తే లేనిపోని అనుమానం పడుతున్నారేమో అనిపిస్తున్నది. దానికి ఒక fair trial యివ్వవచ్చు. నిరుపయోగం అయినట్లయితే, లేకుంటే అనవసరంగా జోక్యం కల్గజేసుకుంటే, రద్దుచేసుకోవచ్చు.

ఒక అభిప్రాయం Prime Ministerకు రావడం, పార్లమెంటులో వారు చెప్పడం, తరువాత దేశం అంతా సుముఖంగా, బాగుందనేటటువంటి భావంలో స్వాగతం యివ్వడం, జరిగిన తరువాత వారు billలో ఉదహరిస్తే యిప్పుడే దానికి అమంగళమైనటువంటి వ్యాఖ్యానాలుచేయడం భావ్యంకాదేమో ననిపిస్తున్నది. ఒకనాడు మతవిషయంగా దేశాన్ని విభజించాలని ఒకప్రచారంజరిగింది "మతంప్రధానంఅంటే, మా మహమ్మదీయులందరం ఒకటి, మా సిక్కులందరం ఒకటి, మా హిందువులందరం ఒకటి" అనేమాదిరిగాఒక భావం మత విషయంగా వచ్చింది దాని మంచిచూశాం. ఇప్పుడుదానిప్రమాదంకూడా చూచినాము. అట్లానే భాషా విషయకంగా యీనాడు ఒకపెద్ద experimentచేయబోతున్నారు. ఇప్పుడేదో ఒక సూత్రాన్ని అంగీకరించారు ఆంధ్ర రాష్ట్రం పెట్టడంలో. ఇప్పుడు దానిని అన్ని రాష్ట్రాలకు హిందీ పంజాబ్ వగైరాలు కాకుండా సముద్ర తీరంలో నున్నటువంటి 9 రాష్ట్రాలను భాష ప్రాతిపదికపై రాష్ట్రాలుగా నిర్మించాలని ఒక పెద్ద ప్రయత్నం, మొదటి ప్రయత్నం, యీనాడు జరుగుతున్నది. కాని దాంట్లోకూడా ఉద్రేకాలు జాస్తిఅయి కేవలం ఉన్మాదులు కొందరు—భాషోన్మాదులై దేశంయొక్క ఐక్యతను, దేశ ప్రతిష్ఠను ఈ భారత మాత అఖండ భూమి అనే భావానికి విరుద్ధంగా ప్రవర్తించారు. ఇది భారత దేశానికి అపకారి అవుతుందేమో అనేటటువంటి ఉద్దేశంకూడా చాలమందికి వున్నది. దీనిని 10 సంవత్సరాలు cold storageలో పెట్టండని కొందరు పెద్దలు అంటున్నారు. భాషా రాష్ట్రాలనేటటువంటి విషయమే బాగాలేదు, ఇది న్యాయంకాదు, ప్రజలకు విరోధం కలుగుతుంది, అనేటటువంటి భావం చెప్పేటటువంటివారు కొందరున్నారు. కాబట్టి అన్ని భావాలు సమ్మేళనం చేసుకుని యిట్లా భాషా రాష్ట్రాలు కావాలనేటటువంటి వారియొక్క సూత్రం అంగీకరిస్తూ మాట్లాడడానికి అట్టే ఎక్కువ ఉద్రేకాలకు పోకుండా కొంత మందంగా Brake మాదిరిగా కొన్ని కొన్ని సంస్థలు ఉండడం మంచి దనుకుంటాను. 1947లో ఇండియా పాకిస్థాను, యీ రెండూ విభజింపబడిన తరువాత పంజాబులో పెద్ద దురంతాలు జరిగి లక్షలాది, వందలాది వధలు జరిగిన తరువాత, Unitory type గల strong Central Government వుంటే బాగుంటుందనే అభిప్రాయానికి Constituent Assembly వచ్చిందే. కేవలం యీ Provincial autonomy అని రాష్ట్రాలకు అధికారాలివ్వడం అనేటటువంటి భావం కాకుండా, We want a strong Central Government అనే అభిప్రాయం కలిగింది. అన్ని వ్యవహారాలు చూచుకొంటూ ఏదయినా పరదేశం నుంచి దండ యాత్ర వస్తే వ్యతిరేకించడానికిగాని లేక ఆంతరంగిక సంక్షోభం ఏదయినా వస్తే దానిని నిర్మూలం చేయడానికోసం Strong Central Government ఉండాలనే భావం—కొంతవరకు పంజాబులోను, తరువాత బెంగాలులో

Dr. B. Gopala Reddi] [4th April 1956

జరిగిన దురంతాలను గమనించిన తరువాత, partition జరిగిన తరువాత దేశం మొత్తంమీద వచ్చింది. అంతకు ముందు ఎక్కువ మంది provincial autonomy వైపు మొగ్గుతున్నటువంటి వాళ్లు యిప్పుడు Strong Central Government వైపు మొగ్గుతున్నారు. కేవలం American Federation మాదిరిగా సంపూర్ణమైనట్టి Autonomy Residuary powers అన్నీ States కు ఉన్నవి అనేటటువంటి మాట మన కేంద్ర ప్రభుత్వం, Constituent Assembly ఒప్పుకోలేదు. మొత్తంమీద చూస్తే మొగ్గేమో కేంద్ర ప్రభుత్వం వైపే వున్నది.

Residuary powers అన్నీ వాళ్లకు యిస్తారు States కు పరిమితమైన అధికారాలుండవలసినదేగాని సంపూర్ణమైనటువంటి Autonomous అధికారాలుగల Sovereign Bodies, Sovereign Assemblies అనేటటువంటి మాటకాకుండా మొత్తంమీద కేంద్రప్రభుత్వం ఆధీనంగాఉన్న రాష్ట్రప్రభుత్వములు ఉండాలన్నారు. అరాచక పరిస్థితులు యీనాడు మనం Bombay లో చూశాము. 70 మందో 80 మందో చచ్చిపోయినారు. ఎందుచేత ? మహారాష్ట్రంలోకి Bombay రాలేదనే. Bombay యొక్క ప్రాముఖ్యత యింతలో పోలేదు. అక్కడున్నటువంటి రేవులు, అక్కడున్నటువంటి సముద్రం ఎక్కడికీపోలేదు. అక్కడున్నటువంటి ప్రధానమైనటువంటి Buildings ఏమీ పోలేదు. కేవలం చేర్చినారు, చేర్చలేదు, అనేటటువంటి మాటమీద 80 మంది చచ్చిపోయినారంటే దేశంలో భాషమీద కొంతపట్టుదలఉన్నది, భాషమీద కొంత ఉద్రేకంఉన్నది, భాషమీద సత్యాగ్రహమైనా చేయడానికి కొందరు పూనుకుంటారు, దానిని ఎట్లాఅయినా exploit చేయడానికి పూనుకుంటారు అనేవిషయం మనకు కొంతస్పష్టమవుతున్నది. కాబట్టి యిదంతా లేదంటే ప్రయోజనంలేదు. ఇది మంచిదే. కాని మంచితోపాటే కొంచెం చెడ్డఉన్నది అని తెలుసుకోడం మంచిదనుకుంటాను. ఆ విషయాన్ని యీనాడు జవహర్లాల్ నెహ్రూగారు పదేపదే చెబుతున్నారు. ఈ రాష్ట్రాల యొక్క సూత్రం మంచిదే, ప్రాథమికంగా మంచిదేగాని దాంట్లోవున్న ప్రమాదాలను వాదించుకోడం మంచిది, అనేటటువంటి మాటగా వారు చెబుతున్నారు. I. A. S. Officers కొంతమందిని, బయటవారిని, పంపించడం మంచిది. లేకుంటే Highcourt Judges ను అప్పుడప్పుడు transfer చేయడం మంచిది. లేకుంటే ఆంధ్రులంతాకూడా లక్నోలోనో కాశీలోనో చదువుకోవడం మంచిది. లేకుంటే అక్కడి విద్యార్థులు యిక్కడకురావడం మంచిది. ఈ మాదిరిగా దేశంయొక్క సమగ్రమైన స్వరూపం తెలిసికోకుండా కేవలం ఒకరాష్ట్రంలోఉండి, ఆ రాష్ట్రమే అన్నింటికీ ప్రధానం, ఆ రాష్ట్రం అభివృద్ధిఅంతా కావాలి యీ రాష్ట్రమే భారతవర్షం అనేటటువంటి ఆవేశాన్ని కొంత తగ్గించడానికి ప్రయత్నం చేసుకోవాలి.

యింతకుముందు చరిత్ర చూచినాం. భారతదేశంయొక్క యితిహాసంలో చిన్న చిన్న రాష్ట్రాలుగాఉండి ఒకదానికొకటి పరస్పర విరుద్ధమైన భావాలు పెట్టుకుని అసలు దేశానికే ప్రమాదం వచ్చేటట్టుగా విదేశదండయాత్ర చేసేదానికి ప్రాతిపదికగా గతంలో ప్రవర్తించినట్లు మనం చూచినాము. అటువంటి ప్రమాదం భవిష్యత్తులో రాకుండా చూసుకోవడం తరువాత ప్రజలకు అందుబాటులో ఉండేటట్లుగా పరిపాలన అంతాకూడా మాతృభాషలో చేసుకున్నప్పటికీకూడా మళ్ళీ విభిన్నత్వం లేకుండా ఏకత్వానికి మనం దారి చూపిస్తూ బలిష్టమయిన కేంద్ర ప్రభుత్వం స్థాపన చేసుకోడానికి ప్రయత్నం చేయాలనేటటువంటిమాట మాత్రం మరచిపోకూడదు. ఒకవేళ ఆంధ్రులం కావచ్చు. ఒరియావాళ్లంకావచ్చు. తమిళులం కావచ్చు. అయినప్పటికీకూడా మనం పరాయిదేశం పోయినప్పుడు మనం భారతవర్షీయులమేకాని ఆంధ్రులంకాదు. తమిళులం కాదు. భారతవర్షం ఉంటే మన ఆంధ్ర రాష్ట్రం సమగ్రంగా ఉంటుంది భారతవర్షమే పడిపోయినప్పుడు, భారతవర్షమే అధ్వాన స్థితిలో, దరిద్ర స్థితిలో పడిపోయినప్పుడు ఆంధ్ర దేశం సంపూర్ణమైన సంపదలతో ఉండడం అనేమాటలేదు. కాబట్టి ఏదయినప్పటికీకూడా యీ దేశం సమగ్రమైనదనే దృష్టి ఉంటేనే భారతదేశం ప్రతిష్ట, మన ప్రతిష్ట. భారత దేశంతో అంగంగా మనం ఉన్నాం అనేటటువంటి భావం కొంతవరకు మనం ఒప్పుకునప్పటికీ కూడా చాలమందికి అలవాటు లేకుండా వున్నది. దానికి ఒక విధమైన అలవాటుకూడా కావాలి అనిపిస్తున్నది. అది యింతకు ముందు ఒకసారి C. R. రెడ్డిగారు చెప్పినారు. ఆంధ్ర మాత, ద్రవిడమాత మహారాష్ట్ర మాతలో అసలు భారతమాత చచ్చిపోయేటట్టున్నది ఆమె ఎటో పలాయనం అయిపోయిందనే టటువంటిమాట వారు చెప్పినారు. ఆ మాదిరిగా కాకుండా భారతదేశమునకు సమగ్రమైనట్టి కీర్తి ప్రతిష్ట, బలం సంపద ఉన్నప్పుడు మనకందరకు సంపదవస్తుందనే మాట మరచిపోవడానికి వీలులేదు. అందువల్ల భాషాతత్వానికి కొంచెం ప్రతిబంధకం అవసరము. Hydraulic brake, వేయాలనే ఉద్దేశం మాత్రంకాదు. భాషాతత్వం పెడదారులపడి చచ్చిపోతున్నప్పుడు ఏదయినా కొంచెం brakes వేయడానికి ప్రయత్నం చేసుకోడానికి కేంద్ర ప్రభుత్వానికి అధికారా లివ్వడం కొంచెం మంచిదేమో అనుకుంటున్నారు. అక్కడ పెద్దలంతా, అయితే కొంతమంది ఇతర భాషలవారు యీ రాష్ట్రంలో ఉంటేకూడా పరవాలేదు. కొంతమంది తమిళులు అరవదేశంలో ఉంటేకూడా పరవాలేదు. కొంతమంది ఆంధ్రులు కన్నడ దేశంలో ఉంటేకూడా పరవాలేదు. వాళ్లకుకూడా సరైన రక్షణలిచ్చి వాళ్ళూ మేము సోదరులుగా ఉన్నామని చూపించగలిగినప్పుడు మనకు యింకా ప్రతిష్ట ఎక్కువవుతుంది. అంతేగాని తెలుగు మాట్లాడినటువంటి

Dr. B. Gopala Reddi] [4th April 1956

ప్రతివారు తెలుగు రాష్ట్రంలోకి రావాలి. తెలుగురాష్ట్రంలో ఆంధ్రేతరులు ఉండకూడదు అనే భావం అంత సూక్ష్మంగా చూడవలసిన అవసరంలేదు. స్థూలంగా చూచుకుంటే యీనాడు Bombay లో, ఎన్ని చెప్పినాకూడా అక్కడ బెంగాలీవారు ఉన్నారు. తెలుగువారు, తమిళులు ఉన్నారు. Bombay ఎక్కడికి పోయినాకూడా ఆ తెలుగువారు అక్కడనుంచి పోబోయేదిలేదు. తమిళులు పోయేదిలేదు. బెంగాలీలు పోయేది లేదు.

అటులనే కలకత్తాలో తెలుగువారుకూడా చాలామంది ఉన్నారు. యు. పి. వారు ఉన్నారు. మహారాష్ట్రులు ఉన్నారు. గుజరాతీలు ఉన్నారు. ఈవిధంగా అన్నినగరములలోను అన్నిభాషలవారు నివసిస్తూ ఉంటే అందరూకూడ సోదరభావంతో ఉండగలరు. సంకుచితమయిన ప్రాంతీయభావము దేశశ్రేయస్సుకు ఉపయోగకారి కాదు. ప్రాంతీయభావాలను హెచ్చుపెరిగిపోనివ్వకుండా చూచుటకు అన్నిభాషలవారు భారతీయులే ననెడి దృక్పదమును ప్రజలలో పెంపుచేయుటకుగాను మాత్రమే జోనల్ కవున్సిల్సు ఉద్దేశింపబడినవి. అంతేగాని వీటివల్లవచ్చే ప్రమాదమేమీలేదు. ఇవి సబ్ ఫెడరేషన్లు ఔతవేమో, కడపటికి ఈ జోనులలోని ప్రాంతములన్నీ ఒకేరాష్ట్రంగా అవుతవేమోనని కొందరు సందేహములు వెలిపుచ్చుతున్నారు. ఒకవేళ ఆవిధంగా అయినప్పటికికూడ ప్రమాదమేమీలేదని నాఉద్దేశము. దక్షిణాదిన ఉన్న నాలుగు రాష్ట్రాలనుకలిపి ఒక సబ్-ఫెడరేషనుగా చేసిననూ పరవాలేదు. అటువంటి ఏర్పాటులో ప్రమాదముకన్న చాలవరకు బలమే ఉన్నదేమోనని నా అభిప్రాయం. ఈ నాలుగురాష్ట్రముల ముఖ్యమంత్రులు కలసి మాకు ఈ ప్రాంతంలో ఫలానా ప్రాజెక్టు కావాలి లేదా ఎరువులఫ్యాక్టరీ కావాలి అని జోనల్ కవున్సిలులో తీర్మానంచేసినట్లయితే దానిని నిరాకరించేముందు కేంద్రప్రభుత్వ మంత్రిగారు కొంత దీర్ఘంగా ఆలోచించవలసి ఉంటుంది. ఒకరాష్ట్ర ముఖ్యమంత్రి లేదా ఒకరాష్ట్ర శాసనసభ అడిగేదానికన్న నాలుగురాష్ట్రముల ముఖ్యమంత్రులుగల ప్రాంతీయ సంఘ తీర్మానానికి ఎక్కువ విలువ ఉంటుంది. కేవలము ఒకే ప్రాంతాన్ని అభివృద్ధి పరచినా ప్రయోజనంలేదని, దేశంలోని అన్ని ప్రాంతాలను సమానంగా అభివృద్ధిపరచవలసి ఉంటుందని మనము అడుగుతున్నాము. అటువంటప్పుడు జోనల్ కవున్సిల్సు ఉండవలసిన అవసరం ఎంతయినా ఉన్నది దక్షిణాదిన ఫలానా అభివృద్ధి పథకం అమలు పరచవలసి వున్నది. మాకు ఇంజనీరింగు కాలేజి కావాలి. ఒక రీసెర్చి స్టేషను కావాలి, లేక ఆల్ ఇండియా ఫిజిక్సు లేబరేటరీ అని నాలుగు రాష్ట్రముల ముఖ్య మంత్రులు కలసి చెప్పినప్పుడు కేంద్ర ప్రభుత్వముకూడ ఆ ప్రతిపాదనను కొంత మర్యాదతో చూస్తుంది. ఐతే కేవలము ఒక్కరొక్కరే చెప్పిన

లేక ఒకరిమీద ఒకరు చెప్పినా ప్రయోజనం వుండదు. అటువంటప్పుడు ఈ జోనల్ కవున్సిల్సువల్ల నాకేమీ ప్రయోజనం కనిపించుటలేదు. ఇరుగు పొరుగు రాష్ట్రాలతో సంప్రతించి పరిష్కరించుకొనవలసిన ముఖ్య సమస్యలెన్నో మన కెన్నో వున్నాయి. మైసూరు, మదరాసు రాష్ట్రములతో సంబంధముగల సమస్యలెన్నో ఉన్నాయి. వాటినన్నిటిని గురించి మనము జోనల్ కవున్సిల్సులో మాట్లాడుకోవచ్చును. మనకు కేరళకు, ఏమీ సంబంధములేదే, అటువంటప్పుడు వారు, మనము ఎందుకు కలవాలి, అని కొంత మంది అడుగుతున్నారు. మనకు మదరాసు వారికి మధ్య పరిష్కారం కావలసిన కొన్ని సమస్యలు వున్నప్పుడు వాటిపై న్యాయమయిన అభిప్రాయములను వెలిపుచ్చుటకు కేరళ, కర్నాటక, రాష్ట్రముల ప్రతినిధులు జడ్జీలుగా వుండే అవకాశం వుంది. అంతే కాకుండా కేంద్ర ప్రభుత్వంలోని మంత్రికూడ ఒక రుంటారు. ఈ విధంగా ఏమీ సంబంధంలేని ముగ్గురు పెద్దలు జోనల్ కవున్సిలులో ఉండడంవల్ల ఆయా సమస్యలను నిష్పక్షపాత బుద్ధితో పరిశీలించడానికి అవకాశం వుంటుంది. వివిధ సమస్యలపై వారు సలహాలు చెప్పవచ్చు. అవి ఆచరణ యోగ్యంగా ఉంటే వాటిని మనం ఆచరించవచ్చు. లేకపోయినట్లయితే కేంద్ర ప్రభుత్వము వారే ఏదో నిర్ణయం చేయవలసి ఉంటుంది. ఏమయినప్పటికిని కొన్ని, కొన్ని విషయములను చర్చించేటందుకు వాటితో సంబంధంకల వాళ్లు సంబంధం లేని వాళ్లుకూడ వుంటే మంచిదేమోనని నేను అనుకొంటున్నాను కాబట్టి యీ జోనల్ కవున్సిల్సువల్ల ఎంతో లాభం కలుగుతుంది. మనము మద్రాసు, కేరళ, మైసూరు రాష్ట్రములవారు అప్పుడప్పుడు కలసుకొని ఆయా విషయముల గురించి మాటలాడు కొనడంవల్ల ఆయా రాష్ట్రములలో ఏమి జరుగుచున్నదో తెలుసుకోవడానికి వీలుంటుంది. ఇతర రాష్ట్రములలో టెక్స్టు బుక్కుల విషయంలో ఏమి చేస్తున్నారు? ఉపాధ్యాయుల జీతముల విషయంలో వారవలంభిస్తున్న విధానం ఏమిటి? అటువంటివి ఎన్నో సంగతులు తెలుసుకోవచ్చు. జోనల్ కవున్సిల్సులో అన్ని విషయాలు మాటలాడుకోవడానికి వీలుగా వుంటుంది. రెండు మూడు నెలలకొకసారి ఆయా రాష్ట్రముల మంత్రులుగాని చీఫ్ సెక్రటరీలుగాని కలసుకోవడం చాలా మంచిదని నా ఉద్దేశము. అనేక విషయాలలో ఒకరినుంచి ఇంకొకరు తెలుసుకొని తమ విధానాలను రూపొందించుకోవడం మంచిది. ఇందుకొరకే జోనల్ కవున్సిల్సు సృష్టింపబడినవి ఐతే మనకు ఒరిస్సావారికి మధ్య కొన్ని సమస్యలున్నాయి. మనకు మహారాష్ట్రులకు సంబంధించిన సమస్యలున్నాయి. అదే విధంగా మనకు, మధ్య ప్రదేశ్ వారికి సంబంధించిన సరిహద్దుల సమస్యలు కొన్ని ఉన్నాయి. అటువంటప్పుడు ఆ రాష్ట్రముల ప్రతినిధులు జోనల్ కవున్సిలులో ఎందువల్ల లేదు అని కొందరు అడుగుతున్నారు. ఐతే ఈ సమస్యలను పరిష్కరించుకొనుటకుగాను మనము

భువనేశ్వరంలోను పూరీలోను ఒరిస్సా ప్రభుత్వ ప్రతినిధులను కలసుకొని మాట్లాడ రాదని నిర్బంధమేమీ లేదు. అవసరము అయితే మాచ్ ఖండు, వంశధార ప్రాజెక్టులకు సంబంధించిన విషయాలు తదితర విషయాలుకూడ మనం వారితో సంప్రదించవచ్చు. అదే విధంగా మధ్య ప్రదేశ్‌కు సంబంధించి సుక్లా గారితోగాని లేక మహారాష్ట్రకు సంబంధించినంతవరకు ఆ ప్రభుత్వమువారితోగాని మాటలాడకూడదని ఎక్కడాలేదు. ఐతే మన జోనల్ కవున్సిలులో దక్షిణాదిన గల నాలుగు రాష్ట్రాల ప్రతినిధులూ ఉంటారు. వీరే కాకుండ కేంద్ర ప్రభుత్వ మంత్రికూడ ఒకరుంటారు ఆయా సమస్యలతో సంబంధమున్నవారు సంబంధము లేనివారుకూడ ఈ కవున్సిలులో ఉంటారు వారుకూడ సలహాలు చెప్తారు. వీలైనంతవరకు ఆ సలహాలను పాటించండి అని కేంద్ర ప్రభుత్వము వారంటున్నారు. అందుకే ఈ జోనల్ కవున్సిల్సు సృష్టింపబడ్డాయి ఏది ఏమయినప్పటికికూడ కొంత మంది తమిళులు ఆంధ్ర దేశంలో ఉంటారు. వారికి ఆంధ్ర ప్రభుత్వము సౌకర్యములు కలుగుచేస్తున్నారా, లేదా అనే విషయంగూర్చి జోనల్ కవున్సిలువారు చర్చిస్తారు. అదేవిధంగా కేరళ దేశంలో కొంత మంది తమిళులు ఉంటారు. వారికి కావలసిన సౌకర్యములు కేరళ ప్రభుత్వము కలుగచేస్తోందా అనే విషయాన్నికూడ కౌన్సిలువారు పరిశీలిస్తారు. ఇటువంటి అంతర్రాష్ట్రీయ విషయములు అనేకముంటాయి. వాటినన్నిటిని పరిశీలించి న్యాయమయిన సలహాలు ఇవ్వడానికి జోనల్ కౌన్సిల్లు ఎంతగానో ఉపకరిస్తాయి. ఇకముందు వ్యాపారంకోసంగాని లేక పరిశ్రమల నిమిత్తంగాని ఒక ప్రాంతంనుంచి యింకొక ప్రాంతమునకు ప్రజలు వెళ్లడం యింకా చురుకుగా జరుగుతుందని నేను ఆసిస్తున్నాను. తెలుగువాడయినవాడు కేవలం తెలగు దేశంలోనే ఉండవలెననే భావం నాకేమీ లేదు అవకాశముంటే ఏప్రాంతంవాడయినా మరొక ప్రాంతానికి వెళ్లవచ్చును. వారి వారి మనోప్రవృత్తులనుబట్టి చదువుకోడానికి విశ్వభారతికి పోవచ్చు. కాశీకి వెళ్లవచ్చు. లేదా మరే విశ్వవిద్యాలయాలకైనా వెళ్లవచ్చు. ఇంతకుముందు మనవారు కాశీకి వెళ్ళి సంస్కృతం చదువుకొనేవారు. అదేవిధంగా ఈ నాడు భారతదేశంలోని ఏ ప్రాంతానికయినా వెళ్లి మనము విద్యాభ్యాసం చేయవచ్చు. అదేవిధంగా వ్యాపారం నిమిత్తం బొంబాయికి పోవచ్చును. మరొక పనిమీద పంజాబుకు పోవచ్చు. ఈ మాదిరిగా అనేకమంది తెలుగువారు ఇతర రాష్ట్రాలకు పోవాలి. ఆ రాష్ట్రాలవారు మన రాష్ట్రానికి రావాలి. మన రాష్ట్రంలోని పరిశ్రమలు కేవలం తెలుగు వారే నిర్వహించవలెనని మాకేమీ లేదు. అవసరమైతే తుంగభద్రా ప్రాజెక్టుక్రింద వ్యవసాయం చేసుకోడానికి మహారాష్ట్రులు గాని, బెంగాలీలు గాని మరే ప్రాంతాలవారు గాని రావడానికి మనకేమీ అభ్యంతరం ఉండదు. ఆ విధంగా మనము

4th April 1956] [Dr. B. Gopala Reddi

అందరిని ఆహ్వానించి, అందరూకూడ మనలను గౌరవంగా చూచినప్పుడు దేశమునకు క్షేమకరంగా ఉంటుంది. కాని మేము తెలుగు వాళ్లంకాబట్టి మేము తెలుగు దేశంలోనే ఉంటాము ఇక్కడనే వ్యాపారంచేసుకుంటాము, యీ దరిద్రములోనే మునిగి తేలుతూ ఉంటాము. ఇక్కడనే చస్తాము, అనడంలో అర్థంలేదని నా అభిప్రాయము. ఎక్కడకు కావాలంటే అక్కడకు పోవచ్చు. ఈ భారతదేశం అంతాకూడా, నా దేశం, అనేటటువంటి భావముతో విజయభేరీలను మ్రోగించవలెనని నా అభిప్రాయము.

అయితే భాషోన్మాదులు కొందరుండవచ్చును అటువంటివారికి ఈ జోనల్ కౌన్సిలు అనేది కొంత నిరోధకంగా ఉంటుందేమోకాని దానివల్ల ఎటువంటి ప్రమాదంలేదని నా అభిప్రాయము. ఈ జోనల్ కౌన్సిల్సువల్ల ఉపయోగమేమీ లేకపోయినట్లయితే 5 సంవత్సరముల తరవాతను 10 సంవత్సరముల తరవాతను నాటంతటవే వాడిపోతాయి. అందువల్ల ప్రమాదమేమీలేదు. జోనల్ కౌన్సిలు అప్పుడప్పుడు సమావేశమై ఆయా రాష్ట్రములకు సంబంధించిన సమస్యలను పరిష్కరించుకోవడం చాలా మంచిది ఈనాడు మైసూరుకు మనకు కొన్ని సమస్యలున్నాయి. కాని హనుమంతయ్యగారు, మనము సమావేశము కావడములేదు. తుంగభద్ర బోర్డులో ఛీఫ్ ఇంజనీర్లు, లేదా గోఖలే మొదలయినవారు మాత్రమే సమావేశమవుతున్నారు. ఆంధ్ర ప్రభుత్వమంత్రులు హనుమంతయ్యగారు కలసి కూర్చొని ఈ విషయమై యింతవరకు మాటలాడుకోలేక పోయినారు. అదేవిధంగా మద్రాసు ముఖ్యమంత్రి కామరాజగారిని కలుసుకున్నామేగాని సరిహద్దుల విషయంలో నిర్ణయమేదీ చేయలేకపోయినాము. ఇప్పుడు ఆ సమస్య అపరిష్కృతంగానే ఉండిపోయింది. ఇంతవరకు ఉభయరాష్ట్రముల మంత్రుల సమావేశము తిరిగి జరగలేదు. ఈ విషయంలో ఎవరుముందు వ్రాయాలి? అనేటటువంటి ప్రశ్నలు తలఎత్తుతున్నాయి. మనము ముందు వ్రాస్తే అది మన బలహీనతగా ఎంచబడుతుందేమోనని మనము ఎంచుతున్నాము. అదే విధంగా వారు వ్రాస్తే వారు బలహీనంగా వున్నారని మనం అనుకుంటామేమోనని వారు వ్రాయకపోవచ్చును ఇటువంటి ప్రశ్నలు ఎన్నో తలలెత్తుతున్నాయి. ఇటువంటి వాటికి తావీయకుండా రెండు మూడు నెలలకు ఆయా రాష్ట్రాల ప్రతినిధులుగల జోనల్ కౌన్సిల్ సమావేశము కావాలని ఒక నిబంధన ఉన్నట్లయితే ఇరుగు పొరుగు రాష్ట్రాలకు సంబంధించిన సమస్యలెన్నో పరిష్కారమవుతాయి. ఈ కవున్సిలులో కేంద్రప్రభుత్వ మంత్రిగారుకూడ ఉంటారు. మన మంత్రులు ఉంటారు. మన అధిక ఉద్యోగులను కూడ సలహాలనిమిత్తమై తీసుకొని పోవచ్చును. అన్ని విషయములను అక్కడ

Dr. B. Gopal Reddi] [4th April 1956

వర్చించుకోవచ్చును. అందరకు ఆమోదకరమైన పద్ధతిలో మన పనులను జరిపించుకొనవచ్చును. ఈ సంఘాలయొక్క సలహాలు వీలయినంతవరకు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు పాటించవచ్చును. ఒకవేళ ఏమైనా విభేదాలుఉంటే కేంద్ర ప్రభుత్వంగాని, ప్లానింగ్ కమిషన్ వారుగాని తీర్పు ఇవ్వవచ్చును. అయితే కొంత మంది గౌరవసభ్యులు జోనల్ కవున్సిల్సు నిర్మాణంవల్ల భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతానికి ఇప్పటినుంచే గోరీ కడుతున్నారని అనుకోవడం న్యాయమయినటువంటి విషయంకాదు. ఈ సంఘాల నిర్మాణం దేశానికి మంచిది. అప్పుడప్పుడు ఆయా రాష్ట్రముల ముఖ్యమంత్రులు కలుసుకోవడం మంచిది. ఒక రాష్ట్రంవారిని మరొక రాష్ట్రంవారు పరస్పరం అర్ధంచేసుకోవడం ఈనాడు ఎంతో అవసరం. అందుకు ఈ జోనల్ కవున్సిల్సు ఉపయోగపడతాయని నేను భావిస్తున్నాను.

ఒకటి రెండు ప్రాంతాలకుకలిపి ఒకే గవర్నర్ ఉన్నందువల్ల సంభవించే ప్రమాదమేదీలేదు. కాని గవర్నరులే అక్కరలేదు, ఆయనక్రింద ఖర్చుపెట్టుచున్నదంతా దండుగ అని సుందరయ్యగారు చెబుతున్నారు. అటువంటప్పుడు ఒకటి రెండు రాష్ట్రాలకు ఒకే గవర్నరుఉంటే మనకు ఏమిపోతుంది? అదేవిధంగా అస్సాము, త్రిపుర, మణిపూర్‌లకు ఒకేగవర్నర్ ఉండడంలో నష్టమేమిటి? పంజాబు గవర్నరును హిమాచల్ ప్రదేశ్ యొక్క విషయములనకూడ చూచుకొనమని చెప్పినందువల్లగాని, లేదా పంజాబుగవర్నరును ఢిల్లీకి సంబంధించిన విషయములను చూచుకోమనడంవల్లగాని వచ్చేప్రమాదం ఏమిటి? ఒకవైపు గవర్నరుకు ఏమి అధికారాలు ఉండకూడదు, ఆయనకు ఏమిశక్తి ఉండకూడదు, కేవలం ఫిగర్ హెడ్‌గా మాత్రమే ఉండాలి అని వాదిస్తూ రెండవప్రక్కన రెండు రాష్ట్రములకు ఒక గవర్నరు ఉండకూడదని వాదించడంలో అర్ధమేమో నాకు తెలియడంలేదు ఉదాహరణకు ఒక గవర్నరు రెండు నెలలపాటు శెలవు తీసుకున్నారని అనుకోండి. అటువంటప్పుడు పొరుగునఉన్న ఇంకొక రాష్ట్రగవర్నరును ఈ రాష్ట్రమునకు ఎడిషనల్ ఛార్జి గవర్నరుగా ఉండమనిచెబితే వచ్చేప్రమాదమేమీలేదు. మామూలుగా ఒక రాష్ట్రానికి ఒక గవర్నరుఉంటారు. ఆయన రెండునెలలపాటు ఇంగ్లండు పోయి వస్తానని అంటాడనుకోండి. లేదా కూతురు పెళ్లికోసమే శెలవు పెడతాడనుకోండి. అంతలోకే ఇంకొకరిని ఆయన స్థానంలో గవర్నరుగా నియమించాలనడం, లేదా ఆరాష్ట్ర ప్రధాన న్యాయమూర్తినే ఈ వ్యవహారాలు చూస్తూ ఉండాలనడం కన్నా పొరుగు రాష్ట్ర గవర్నరును ఎడిషనల్‌ఛార్జి ఉండాలనడంలో ప్రమాదమేమీ లేదు. అయితే అస్సాము, త్రిపుర, మణిపూర్‌లకు ఒకే గవర్నరును ఏర్పాటు చేయాలనే తలంపే ఇటువంటి సవరణకు ప్రధాన కారణం. లేక పంజాబు గవర్న

రునే హిమాచల ప్రదేశ్‌కుకూడ గవర్నరుగా కేంద్రప్రభుత్వం ఉండమనవచ్చును ఏదైనా అవసరమొచ్చినప్పుడు శాశ్వతముగాగాని, తాత్కాలికముగాగాని రెండు మూడు రాష్ట్రాలకు ఒకే గవర్నరును నియమించే అధికారాన్ని కేంద్రప్రభుత్వానికి యివ్వటానికే ఈ సవరణ ఉద్దేశింపబడింది. అంతేకాని దీనివల్ల ఏదో మహోపద్రవము వాటిల్లుచున్నదని మన పరిపాలనాధికారము సంకుచితమవుతుందని అనుకోవడం సబబుగాదు.

అదేవిధంగా సర్వీస్ కమిషన్, హైకోర్టును ఏర్పాటు విషయంలోకూడ భయపడవలసినదేమీ లేదు. ఒకవేళ పంజాబు, హిమాచల్ ప్రదేశ్‌లకు ఒకే హైకోర్టు ఉంటే మునిగిపోయేది ఏమిటి? అట్టులనే త్రిపుర, మణిపూర్, అస్సాములకు ఒకే హైకోర్టుఉంటే వచ్చేప్రమాదమేమీలేదు. ఈనాడు మహారాష్ట్ర, గుజరాత్, బొంబాయి రాష్ట్రములనుకలిపి ఒకే హైకోర్టు ఉన్నప్పటికి ఏమీ పరవాలేదు.

ప్రమాదం లేనిచోట ప్రమాదమున్నదని భావించి భయపడడం న్యాయం కాదు. కేంద్రప్రభుత్వంవారు దీర్ఘంగా ఆలోచించి ఉదారమైన బుద్ధితో చేయ దలచుకున్న మార్పేకాని దీనిలో ఏమీ ప్రమాదంలేదు దేశంలోని వివిధరాష్ట్రాల వారికి శిగాయిదాలు పెట్టడానికి, విభజించి పాలించడమనే సిద్ధాంతాన్ని అమలు పరచడానికే ఈ సవరణ ఉద్దేశింపబడిందని కొందరు మిత్రులు అనడంలో ఎంత మాత్రం సత్యంలేదు.

ముఖ్యంగా జోనల్ కౌన్సిలు విషయంలో మనము Experiment చేసి వాటిలో అనర్థకములేమయినా ఉన్నట్లయితే 5, 10 సంవత్సరములయిన తరువాత అవసర మయితే ఏమి మార్పులు చేసుకోవాలో ఆలోచించుకోవచ్చునుగాని యిప్పటినుంచే వాటిని దుయ్యబట్టడం న్యాయంకాదని నేననుకుంటున్నాను.

ఇక రీజినల్ కమిటీల విషయం కారణమేమయినప్పటికీ తెలంగాణావారిలో కొన్ని అనుమానాలు ఉన్నాయి. విశాలాంధ్రకు ఏదో కొంత వ్యతిరేకత ఉండినది. ఆ వ్యతిరేకత ఉండినందువల్లనే ఈనాడు మనము ఇంతగా సంతోషిస్తున్నాము. వ్యతిరేకత లేనినాడు విశాలాంధ్ర నిర్మాణం సామాన్య విషయంగా ఎంచబడి ఉండేది. కొన్ని పత్రికలు విశాలాంధ్రకు వ్యతిరేకంగా వ్రాసేవి. కాంగ్రెసువారిలో కూడ వ్యతిరేకత ఉండినది. ఈ రీజినల్ కమిటీల ఏర్పాటుతో ఆ వ్యతిరేకత సమసిపోయింది. ఈనాడు విశాలాంధ్రకు అందరు సుముఖులే. అందువలననే మనకు ఇంత సంతోషముగా ఉన్నది.

Dr. B. Gopala Reddi] [4th April 1956

అయినప్పటికికూడా ఈ విధమైన అనుమానములు ఉండడము సహజమే. ఒకేసారి అనుమానములేకుండా ఉండడము మానవస్వభావం కాదు. వాటిని తీర్చవలసిన ఔదార్యము మనము చూపించవలయును. మనము చూపించినామంటే అయిదుసంవత్సరాలలో వారే Regional committee వద్దనవచ్చును. వెనుకబడిన తాలూకాలలో వారికి ఒకవిధమైన అనుమానం ఉన్నది. ఇది ప్రతిజిల్లాలోనూ చూస్తున్నాము. నెల్లూరుజిల్లాలో నెల్లూరుతాలూకాకు, కొవ్వూరుతాలూకాకు అంతా చేసుకొంటున్నారు. ఉదయగిరి, రాపూరు దర్శితాలూకాలకు ఇవ్వరు అనుకుంటూ ఉంటారు. అట్లాగనే గుంటూరుజిల్లాలో గుంటూరు, తెనాలితాలూకాలవారు అన్నీ చేసుకుంటున్నారు, మా సత్తెనపల్లి, వినుకొండతాలూకాలకు ఏమీ చెయ్యలేదని complaint చేస్తారు. అట్లానే కొన్నిశతాబ్దాలనుంచి వేరుగా ఉన్నవారు తిరిగి కలుస్తున్నప్పుడు అనుమానాలు ఉండడం సహజం. అందులో, ఇక్కడ ధనము ఉన్నది, ఇర్రిగేషను ఉంది, చదువు ఎక్కువగా అభివృద్ధిచెందింది. ఈ పరిస్థితులలో అక్కడ తెలంగాణావారు 5, 10 సంవత్సరాలు మా విషయాలు మేము చూచుకుంటాము, మా development, మా ఆర్థికవిషయములు మేము చూచుకుంటాము, అంటే మీరు అధికులుగాఉన్నారు కనుక, మాకు లేకుండా చేస్తారు అనే అనుమానంవల్లనే అడిగినారనుకోండి. దానిని ప్రతిఘటించి ఈ రీజినలు కమిటీవల్ల ఏదో ప్రమాదం రాబోతూవున్నదని, seperatist tendency అగుతుందని, ఎప్పటికి శాశ్వతముగా రెండు విడి అసెంబ్లీలు రెండు కాబినెట్టులు, ఇద్దరు finance ministers ఉంటారని అనుకోనక్కరలేదు. ఏదో 5, 10 సంవత్సరాలు వారి education కోసము, Development కోసము బడ్జెటులో ప్రత్యేకించినది సక్రమముగా వినియోగము అవుతుందో లేదో చూచేదానికి పెట్టునదిగాని, ఇందులో ఏదో ప్రమాదము ఉందని ఉపద్రవం ఉందని నేను అనుకోలేదు. మన ఈ ఔదార్యంవల్ల వారు మాకు అవసరం లేదు, మాకు సమానమైన treatment ఉన్నది. ఈ ప్రభుత్వంవల్ల ఈ శాసనసభవల్ల న్యాయం కలుగుతున్నది అని వారిచేత చెప్పించకల్గిననాడే మనకు విజయం చేకూరుతుంది, ఇది 5 సంవత్సరాలు మాత్రమే ఉంటేది. కాబట్టి దానివల్ల ప్రమాదం జరుగుతుందని అనుకొనవలసిన పని లేదు.

ఎలక్షన్లవిషయము వేమయ్యగారు చెప్పినారు. సుందరయ్యగారు చెప్పినదే వారూ చెప్పినారు. ఎలక్షన్లవిషయములో ఖర్చు 30, 40 లక్షలైనా, ఫరవాలేదు, మళ్ళి ఎలక్షన్సుకు పోకూడదా? అన్నారు. Next sentence లోనే upper house ఎందుకు అన్నారు, లక్షలఖర్చు అన్నారు. కౌన్సిలుకు ఇంతకుముందు మద్రాసులో జరిగిన ఖర్చు నాకు తెలుసును 2½ లక్షలుకన్న ఎక్కువలేదు.

Chairman, Deputy Chairman ల జీతాలు, T.A అంతా కలిసి 2½ లక్షల కన్న ఎక్కువకాదు. ఇది దబారా ఖర్చు అంటున్నారు. ఎలక్షన్సుకు 30, 40 లక్షలు దుబారా కాదంటున్నారు. 1955 లో 40 లక్షలు అయినది, మళ్లీ 1957 లో మరో 40 లక్షలు ఖర్చు అవుతుంది. పార్లమెంటు ఎలక్షన్సు జరుగునప్పుడు ఆ ఖర్చు వారే పెట్టుకుంటారు. అప్పటిలోనే మనము పెట్టుకుంటే సగం వారు, సగం మనము పెట్టుకోవాలి దాదాపు 25 లక్షలు మనము పెట్టుకోవలసివుంటుంది. 75 లక్షలు ఎందుకు ఖర్చుపెట్టుకోవాలి. 1955 లో 40 లక్షల ఖర్చుతో ఎలక్షన్సు జరిపి ప్రజాభిప్రాయం తెలుసుకొని 5 సంవత్సరాలు ఉంటామని వచ్చినతరువాత ఏ సూత్రముకోసము మళ్లి ఈ నాడు ఎలక్షన్సు జరుపడము? Constitution ప్రకారము ఎలక్షన్సు అవసరమైతే తెలంగాణాలో ఎలక్షన్సు జరుపుకొనవచ్చును. మనకు పోయిందేమీలేదు. వస్తే నాలుగు seats అదనంగా వస్తాయనుకోవచ్చును ప్రతిపక్షసభ్యులు. అయితే దానిలో ప్రమాదము ఏమిటంటే 30, 40 లక్షల ఖర్చుతో కోట్లకొలది ఆడవాళ్లను మగవాళ్లను best set of issues మీద poling కు తెస్తామా? ఎన్నికలలో స్థానికమైన ఇర్రిగేషను. కమ్యూనికేషన్సు, విద్యవంటి చిన్నచిన్న విషయాలుపెట్టి మభ్యపెట్టడము న్యాయముకాదు.

ఈనాడు తెలంగాణాసోదరులు ఎన్నికలను కోరినారు. నిన్న ఈ విషయము చర్చకువచ్చింది. ఎలక్షన్సు ఎప్పడుపెట్టుకొంటారు? బిల్లులో ఉన్నట్లు semi-general elections జరుపుకొని మళ్ళీ ఎలక్షన్సుకు పోతారా? లేకపోతే ఇపుడే ఎలక్షన్సు లేకుండా చేసుకుంటారా? 1962 లో ఎలక్షన్సు జరుపవలెనా? అనే విషయము చర్చకు వచ్చింది. వీరందరు 1957 లో ఎలక్షన్సు కావాలని కోరినారు. వారికి సంపూర్ణమైన 5 సంవత్సరాల పరిమితి కావలెనన్నారు. మూడు సంవత్సరముల తరువాత మీ term అయిపోయింది పొమ్మని చెప్పడం న్యాయంకాదు అన్నారు. అవసరమైతే మనకు 2 సంవత్సరములు కాలపరిమితి ఇవ్వమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరండి అంటున్నారు. 1957-62 లో ఎలక్షన్సు తొందరపెట్టకూడదు అన్నారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— మనంకూడా 1957 లో ఎన్నికలు పెట్టుకుంటే సరిపోతుందికదా!

THE HON. DR. B. GOPALA REDDI :—అంత ఆశక్తి ఉంటే పంచాయితీబోర్డు, మ్యునిసిపలు ఎన్నికలలో పాల్గొనరాదా?

ఎసెంబ్లీ ఎన్నికలు ఒక్క ఆంధ్రలోతప్ప తక్కినచోట్ల జరుగుతవి. పార్లమెంటు ఎలక్షన్సు ఆంధ్రలోకూడా జరుగుతవి. అయితే ఎల్లకాలం ఎన్నికలు

Dr. B. Gopala Reddi] [4th April 1956

వేర్వేరు సంవత్సరాలలో జరుగుతూ ఉంటే ఇతర ప్రాంతాలకు, మనకు సమన్వయం కుదరకుండా మనము వేరు వారు వేరుగా ఉండిపోతుంది. పార్లమెంటుకు 1962లోనూ శాసనసభకు 1965 లోనూ మళ్ళీ పార్లమెంటుకు 1967 లోనూ ఎలెక్షనులు వస్తాయి. ఈ మాదిరి ద్వంద్వంగా ఉంటుంది, అట్లా కాకుండా ఎక్కడనో ఒకచోట all India pattern లోకి రావడము ఇతర రాష్ట్రాలతో మనముకూడా ఎలక్షన్సు జరుపుకొనడము మంచిది. కాబట్టి ఇప్పుడు మనకు వారికి 1957-62 వరకు time ఇస్తే, మనకుకూడా రెండు సంవత్సరాల కాలపరిమితి పొడిగిస్తే పరవాలేదు అనేది నా official amendment లో కోరుతున్నాను. తెలంగాణా నాయకులుకూడా వారికి 1957 లో ఎన్నికలు జరిగినతరువాత 5 సంవత్సరముల కాలపరిమితి ఉండవలెనని చెప్పినారు. దానిప్రకారము అమెండుమెంటు పెడుతూ ఉన్నాను. అది అన్యాయమైన విషయము కాదు.

ఇక Upper House విషయములో చాలామంది కమ్యూనిస్టు మిత్రులు, సోషలిస్టులు వ్యతిరేకులే కాంగ్రెసుపార్టీలోకూడా ఒకరిద్దరు అది ఉండవలసినవపని లేదని చెప్పినారు. ఇది ఈనాటి వాదము కాదు. 20, 30 సం లనుంచి ఈ bicameral legislatures గురించి political pandits చర్చించుకున్నారు. ఇంగ్లండులోను, అమెరికాలోను, ఐరోపాదేశాలలోను ఇది ఉన్నది. మన దేశములోని చాలా రాష్ట్రాలలోని ఉన్నది. మన దేశములో ఏడెనిమిది రాష్ట్రాలలో ఉండబోతున్నది. ఇటువంటి పరిస్థితులలో మనకుకూడా Legislative Council ఉండడం అవసరమనుకొంటాను. ఒక Legislative Council పెట్టుకొని Scientists, pandits ను పెట్టుకుని ఇక్కడ జరిగిన విషయాలను పునరాలోచించుకొనడానికి, సలహా చెప్పడానికి revising chamber అవసరం ఉంటుంది. మధ్యప్రదేశ్ లో పెడుతున్నారు. మనకు అంటెకన్న ఎక్కువ జనాభా ఉంది. మహారాష్ట్రంలోను, బొంబాయిలోను వద్దన్నారు. Different patterns of people ఇక్కడ ఉంటాము. ఆ రాష్ట్రాలలోని పరిస్థితులకు, మన రాష్ట్రంలోని పరిస్థితులకు కొంత వ్యత్యాసం ఉంది. భూమిశిస్తు మనకొకరకము వారికొకరకము. ప్రతివిషయములోకూడా ఇన్ని రోజులనుంచి ఇంకొక రకముగా ఉంటూ వచ్చినారు. ఇటువంటి పరిస్థితులలో second chamber అన్ని Points దీర్ఘంగా ఆలోచించడానికి 72 మెంబర్లతో వేసుకుంటే మంచిదనే ఉద్దేశము ఉన్నది. వారు కావలెనని కోరినారు. తెలంగాణా నాయకులు ముందంజవేసినారు అది మనము కూడా ఒప్పుకొనడము మంచిది. మాకు అక్కరలేదు, second chamber useless old hard task-గారి సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నాము అనేది కాకుండా వారు కోరినారు కాబట్టి, మనకుకూడా ఏమీ ప్రమాదంలేదు కాబట్టి ఒప్పుకుందాం.

మద్రాసు అనుభవం మనకు ఉన్నది. Madhya Pradesh, Bengal, Bihar, U. P. లలో ఎగువ సభలు ఉన్నవి. కులతత్త్వాలుపోయి అందరు వామపదాన్ని అనుసరించినపుడు ఇటువంటివన్నీ కూడా ఒక్కసారి అదృశ్యం కావచ్చును. అంత వరకు ఇవి ఉన్నా ప్రమాదములేదు. కౌన్సిలుకు ఖర్చు ఎక్కువకాదు. $2\frac{1}{2}$ లక్షలు ఏమంత ఎక్కువకాదు. కాబట్టి Second Chamber కావలెనని చెప్తున్నాను.

ఇక High Court విషయంలో ఇక్కడ ఏలాంటి భేదాభిప్రాయాలులేవు. మనకు సంబధించినంతవరకు కమ్యూనిస్టు పార్టీగాని సోషలిస్టుగానీ, ఎవరుగానీ ఏలాంటి భేదాభిప్రాయాన్ని కనబరచలేదు. నాగినేని వెంకయ్యగారు మాత్రం గుంటూరులోనే ఉంటే బాగుంటుందని చెప్పినారు. జాలయ్యగారుకూడా చెప్పినారు. పోనీ second చేశారనుకోండి. కొంతవరకు మండల అభిమానం చూపించడం మంచిదే. వారి అభిప్రాయాలు వారు చెప్పడంలో తప్పేమియులేదు. రెండు టెలిగ్రాములుకూడా వచ్చినవి. గుంటూరు Bar Association వారుకూడా చెప్పారు. ఏమైనప్పటికి మొత్తంమీద చూస్తే అన్ని పార్టీలవారు High Court విషయంలో seat of the High Court కూడా రాజధాని నగరంలోనే ఉండాలని చెప్పుతున్నారు. మనము ఆంధ్ర రాష్ట్రమును కోరిన మొదటినుంచి అంటే శ్రీభాగ్ ప్యాక్టు ఏర్పడినప్పటినుంచి కూడా మన ధృక్పథము seat of the High Court ఒకచోట, Seat of the Government ఒకచోట అనే భావంతో గత 20 సంవత్సరాలుగా ప్రచారం చేసుకొంటూ వచ్చాము. అది Sri Bhag Pact లో cardinal Principle గా కూడా ఉన్నది. ఒకచోట High Court ఉంటే ఇంకో చోట రాజధాని ఉండాలనే భావం. కానీ ఇప్పుడు మన తీర్మాన ప్రకారం గవర్నమెంటు Hydrabad కు పోతే High Court కూడా Hyderabad కే పోవాలి. రెండు ఒకచోటనే ఉంటే ఒకదాని నొకటి బలపరుస్తుంటుంది. ఈ రెండంగములుకూడా ఒక చోటనే ఉంటే తప్ప ఇది న్యాయముకాదు అని ఘాటుగా మనము అనుకోవడం అసమంజసమైన విషయం. ఇన్నాళ్లనుంచి మనము ఇందుకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ వచ్చినాము. ఆ ప్రచారఫలితంగా ఒకటి కర్నూలులో మరొకటి గుంటూరులో ఉండటం తటస్థించింది. ఇవి అన్నికూడా సమాప్తమై మనం హైదరాబాదుకుపోవడం మంచిదని నేను అనుకుంటున్నాను. ఇటీవలనే న్యూఢిల్లీలో విన్నంతవరకు Supreme Court Buildings ను కొన్ని లక్షల రూపాయలు ఖర్చుపెట్టి ఢిల్లీలో కట్టుతున్నారు. అప్పుడు Government of India వాళ్లంతాకూడా ఇక్కడ over crowding గా ఉన్నది ? Supreme Court ఢిల్లీలో ఎందుకుండవలెి? ఏ నాగపూరులోనో, ఎక్కడనో పెట్టుకుందామనే భావంతో వాళ్లు Supreme

Dr. B. Gopala Reddi] [4th April 1956

Court వాళ్లను అడిగినారు. మీరు ఎక్కడకైనను, ఏ హైదరాబాదుకో, నాగపూరుకో పోయి మీ Supreme Court ను పెట్టుకొని అక్కడనుంచి పనిచేయండి అనేటటువంటి మాదిరిగా చెప్పితే, అప్పుడు Supreme Court Judges అందరూ కూడా, మేము డిల్లీలోనే ఉండవలె నన్నట్టుగా వాళ్లు ఏకగ్రీవంగా తీర్మానమును pass చేసి పంపించినారు. దానిని గవర్నమెంటు ఆఫ్ ఇండియా వారుకూడా ఒప్పుకొన్నారు. అందువల్ల ఈనాడు Supreme Court కు Delhi లో పెద్ద భవనము కట్టి అక్కడనే శాశ్వతముగా ఉంచడానికిపూనుకొంటున్నారు. Judges కు option ఇచ్చినారు. మీకు కోటి రూపాయలు ఇస్తాము. ఏ నాగపూరులోనో కట్టుకోండి. నాగపూరు centre గా కూడా ఉంటుంది. అంటే Supreme Court Judges, ఎక్కడ Government ఉంటుందో అక్కడనే మేము ఉండాలనే భావము వెలిబుచ్చారు. దాన్ని Government of India వారుకూడా అంగీకరించారు. అదే సిద్ధాంతం ప్రకారంగా మన High Court కూడా Hyderabad లో ఉండటం హైదరాబాదులోని వాళ్లకుకూడా క్షేమం. ఇప్పుడేదో కొంతమంది వ్యక్తులకు నష్టమొస్తుందని భయపడితే భయపడవలసిందేగానీ, మొత్తంమీద ఇంతమంది Lawyers, Advocate Generals, Government Pleader లు అంతాపోయి, High Court, Secretariate అన్నికూడా ఒక్కచోటనే ఉన్నప్పుడు Hyderabad యొక్క ప్రాముఖ్యత పెరగడానికి వీలుంటుంది. తెలుగువాళ్ల కింతవరకు ఒక నగరములేదు. ఒక cultural capital city లేదు. ఏమి ఉండినప్పటికీ మద్రాసులో ఉండిపోయింది. ఇన్నాళ్లనుంచి మనకు బెజవాడ, గుంటూరు, రాజమండ్రి, విశాఖపట్టణము అన్ని విస్తీర్ణమైన పట్టణము లుంటూ వచ్చినవి. High Court ను, Secretariat ను హైదరాబాదుకు తీసుకెళ్ళి ఆ నగారాన్ని పెంపొంద చేసుకోవాల్సిన అవుసరంకూడా ఉంది అందువల్ల ఇన్నాళ్లనుంచి మనమే handicap క్రింద ఉండినామో అది పోగొట్టుకొనడానికి తప్పకుండా హైదరాబాదే అన్నిటికీ మనకు కేంద్రంగా ఉండాలి. మన పత్రికలన్నీ కూడా అక్కడినుంచే రావాలి. మన పండితులు, కవులు, గాయకులు అందరు, కూడా హైదరాబాదులోనే ఉండి అక్కడనుంచి నాలుగు ప్రక్కలనున్న జిల్లాలకు ప్రచారం చేయాలని మనం కోరుతున్నాము. కాబట్టి ఈనాడు High Court కూడా హైదరాబాదులోనే ఉండాలని కోరడం న్యాయమైన విషయం. ఏదో కొంతమంది వ్యక్తులకు నష్టమొస్తే రావచ్చు అదికూడా ఎంతవరకు వస్తుందో నిన్న మేము కొంతవరకు చర్చించినాము. బ్రహ్మాండముగా వస్తే ఏ 15 మందికో 20 మందికో నష్టం వస్తుందేమో, మిగతావారికి వాళ్లవాళ్ల కేసులు వాళ్లకుంటాయి. కొంత మందేమో Religious Endowment కు సంబంధించిన case లకు పోతారు.

కొందరు C.R.T.B. కేసులకు పోతారు. కొందరు sales tax, income-tax case లకు పోతారు. ఈమాదిరిగా అనేకమంది అనేక విభాగాలుగా ఉంటారు కాబట్టి ఏదో వాళ్ల practice effect అయ్యేవాళ్లు 10, 15 మందికన్నా ఎక్కువ ఉండరు. కాబట్టి ఆ విషయంలో కూడా ఇక్కడ మనలో ఏకాభిప్రాయం ఉన్నందుకు, జాలయ్యగారు, వెంకయ్యగారున్నప్పటికి గూడా మొత్తంమీద 100 కి 98,99 పాళ్లు ఏకాభిప్రాయం తోనున్నందుకు, అభినందిస్తున్నాను. ఎందుకంటే, మనం ఆంధ్రులంతా కూడా న్యాయంగా చూస్తే High Court ను గుంటూరులోనే పెట్టుకొంటామని కోరవలెను ఇంతకుముందు Seat of Government ఇస్తున్నాము కాబట్టి Seat of High Court మాకుండవలెనని కోరడం సహజం. అయినప్పటికీ కూడా హైదరాబాదుయొక్క భవిష్యత్తు, మన రాజధానీ నగరముయొక్క భవిష్యత్తును ఆలోచించి ఈ High Court కూడా అక్కడనే ఉండాలని కోరడం మనయొక్క ఔదార్యాన్ని చూపిస్తుంది. వాళ్లకుకూడ నష్టములేదు. అది ఎప్పటికైనా అందరికిగూడా శ్రేయస్కరంగా ఉంటుంది. నిన్న జరిగిన చర్చలగురించి వేమారెడ్డిగారు అడిగారు కాబట్టి చెప్పాల్సిఉంది ఈ విషయంలో కొంత చర్చ జరిగింది. కానీ మీరు చెప్పేది చెప్పండి. Seat of the High court Hyderabad లో ఉండాలని మీరు చెప్పేది చెప్పండి. Principle Seat High Court Hyderabad లో ఉండి ఏదైనా Benches కావాలంటే పెట్టుకోవచ్చును అనేటట్టుగా మేము అసెంబ్లీలో పెట్టుకొంటాము అని వారు కోరినారు. దీంట్లో కొంత సంపూర్ణమైన ఏకాభిప్రాయానికి రాలేకపోయినాము. మీరేమో Seat of High Court shall be at Hyderabad అని చెప్పుకోండి. మేము Princeple Seat of High Court many be at Hyderabad అని చెప్తాము; దాంట్లో Separate benches కు కూడా అవకాశమిస్తాం, Central Goverment వారు, Home Ministry వాళ్లందరుకూడా ఏమన్నా decide చెయ్యనీయండి'' అనే భావంతో సంపూర్ణమైన ఏకాభిప్రాయానికి రాలేకపోయినాము. తర్వాత పేరు విషయంలోకూడా అనేకమంది అనేక విధాలుగా చెప్పారు. మన తిమ్మారెడ్డిగారు రామరాజ్యమని పేరు పెడ్తే బాగుంటుందని చెప్పారు. రామ రాజ్యం ఎప్పుడు వస్తుందో అప్పుడు రామభక్తులు చాలమంది బయల్దేరుతారు. రామభక్తులు ఆంజనేయులు బయల్దేరేటప్పటికి ఏమవుతుందో ఒక్కొక్కసారి తెలియదు, రాయలపేరుతో పెడ్తే బాగుంటుందన్నారు, తెలుగుసీమఅన్నా బాగుంటుందని పేట బాపయ్యగారు చెప్పారు. మనము మొదటినుంచీ కూడా ఏమి చదువుకొన్నామంటే తెలుగుచదువుకొంటున్నామని పల్లెటూళ్లలో చెప్తుతారు. కాబట్టి తెలుగు దేశమును తెలుగునాడంటే బాగుంటుందన్నారు. ఈ విషయంలోకూడా

Dr. B. Gopal Reddi] [4th April 1956

మేము నిన్న సంపూర్ణమైన ఏకాభిప్రాయానికి రాలేకపోయినాము. కాని వాళ్లు కూడా "ఆంధ్ర ప్రదేశ్" అనే పేరును ఆలోచిస్తాము. ఎట్లయినా పెట్టితీరాలి అనేపట్టుదలగా వాళ్లు చెప్పలేదు. దీని విషయంలో హైదరాబాదులో కొంత వాదోపవాదాలు జరిగినవి. కాబట్టిమేముకూడా దీనినిగురించి consider చేస్తాము. మీరు కావాలంటే ఆంధ్ర ప్రదేశ్ అని pass చెయ్యండి మేముకూడా దాన్ని consider చెయ్యడానికి సిద్ధంగా వున్నాము" అన్నమాట చెప్పినారేగానీ ఆంధ్రప్రదేశ్ అనే పేరు పెట్టుకుందాము అనే అంగీకారానికి మాత్రంనిన్న రాలేదు. అయినప్పటికినీ వాళ్లు అంత వ్యతిరేకత చూపించలేదోమో అనుకుంటున్నాను. ఇప్పటికైనా ఆంధ్ర ప్రదేశ్ అనే పేరు ఉపయోగించము, అంటే తెలంగాణా అంటే ఆ జిల్లాలని, ఆంధ్ర అంటే ఈ జిల్లాలని, ఆంధ్ర ప్రదేశ్ అంటే 20 జిల్లాలకు సంబంధించిన పేరుగా మూడు పేర్లు ఉండడం కొంత కాలంవరకు అవుసరం. అందువల్ల ఈ నాడు ఆంధ్ర ప్రదేశ్ అనే పేరును వాళ్లు వ్యతిరేకించరని, కడపటికి మన తీర్మాన ప్రకారంగా Government of India వారు ఒప్పుకుంటారనికూడా నేను ఆశిస్తున్నాను ఆ మాదిరిగా నాయకుల సంపూర్ణ ఏకాభిప్రాయం లేకపోయినప్పటికీ వాళ్లు అంత విముఖత్వమేమీ సూచించలేదు. దాన్ని కొంత ఆలోచిస్తామన్నారు.

సుందరయ్యగారు Council of States లో Equality of Representation ఉంటే బాగుంటుందన్నారు. అది సాధ్యమయితే నాకుకూడా సంతోషమే. ఉత్తర ప్రదేశుకు ఎంతో, కేరళకుకూడా అంతే representation. ఇప్పుడు అమెరికాలో చిన్న పెద్ద 48 States వున్నాయి. వాటన్నిటికీకూడా Upper House లో సమానమైన representation వున్నది.

ప్రతి State కు కూడా ఇద్దరిద్దరు చొప్పున representatives వున్నారు. కానీ మన దేశంలో మొదటనుంచీ ఆమాదిరిగా చేయలేదు. అక్కడ నుంచి వచ్చిన తర్వాత ఇక జిల్లాలకంతా సమానంగా రావాలి. 72 seat లలో చిన్న జిల్లాలకు ఎంత కావలెనో పెద్ద జిల్లాలకుకూడా అంతే కావాలనేభావం, లేకుంటే తాలూకాలకది ఈ విధంగా సమానత్వం లభించితే మంచిదే. కాని ఇప్పుడుండే పద్ధతిలో Constitution కు Amendment పెట్టి Council of States లో ప్రాతినిధ్యం ఉత్తర ప్రదేశ్ కు ఎంతో. రేపు ప్రొద్దున కేరళకో, అస్సాముకో ఉండాలనడం ఒక రకంగా న్యాయంగా వుంది. మరొక రకంగా అన్యాయంగావుంది 6 కోట్ల చిల్లర మంది వున్న ఉత్తర ప్రదేశ్ కు 50 లక్షలో 60 లక్షలో వున్న అస్సాముకూ ఒక్కే representation ఉండడం Democracy కి సమన్వయం కాదేమో అని

అనుకోవలసివుంది. Democracy అంటే కేవలం Counting of heads కాబట్టి అదికూడా కొంత ప్రధాన సూత్రంగా పెట్టుకొని మనం చేసుకోవడానికి వీల్లేదు. కాని ఎప్పుడైనా సమాన ప్రాతినిధ్యం ఈయగల్గితే నామట్టుకు నాకు, నా పార్టీవారికి ఆక్షేపణ వుండదని నేను ఆశిస్తున్నాను.

ఈ విషయములన్నియు మనం ప్రధానముగా చర్చించుకొని, వాటిని, ఈ నెల లోనో, పై నెలలోనో పార్లమెంటులో ప్రవేశపెట్టవలసియున్నది. దీని విషయంలో కేంద్ర ప్రభుత్వంవారు మనకు న్యాయము కలుగజేయాలని కోరుతున్నాను. మును ముందు రాబోయే విషయము లన్నింటికికూడా, ఇది ప్రాతిపదికగా వుంటుందని నేను సంతోషిస్తున్నాను. ఈ బిల్లు విషయంలో ఈ నాడు మనకు కొంత వ్యతిరేకత వున్నప్పటికి, ఆనందం ఎక్కువగా వున్నది. హైకోర్టు విషయంలోను, పేరు విషయములోను కొంత వ్యతిరేకత వున్నది. అయినప్పటికి సరియైన, న్యాయమైన నిర్ణయము వస్తుంది. ఆ నిర్ణయము అందరికీ సంతోషకరంగా వుండగలదు. ఈ విషయంలో అందరూ ఉత్సాహ పూర్వకంగా వారి అభిప్రాయాలను చెప్పినందులకు సంతోషము. ఈ మూడు రోజుల నుంచి దీనిని చర్చించినందులకు నా అభివందన లను తెలుపుతున్నాను.

SRI L. LAKSHMANA DAS :—బళ్ళారి విషయము చెప్పలేదు.

THE HON. DR. B. GOPALA REDDI :—చాలామంది బళ్ళారి ప్రజలు 2½ సంవత్సరములనుంచి, ఎంతో ఉత్సాహంగా, అకుంఠితంగా, సాహస మైన ప్రచారాన్ని సాగిస్తూవచ్చి, ఎంతో డబ్బు వ్యయపరచుకున్నారు ఎంతో శ్రమపడినారు. బళ్ళారి సమస్యను ఆధారంగా తీసుకొని, మైనూరు అసెంబ్లీకి గంగప్పగారు రాజీనామా చేయడం, మరల బై-ఎలక్షను జరపమనడం, వారు ఎన్నికలలో పాల్గొనడానికి సంసిద్ధంగా ఉన్నామని చెప్పడం, చూస్తే ఇదంతా త్యాగ పూరితమైన విషయముగా కన్పించుచున్నది. వారుచేసిన కృషికి మనం అందరం జోహార్లు అర్పిస్తున్నాము. వారికి మనము సహాయము చేయలేకపోయినామే అనే దిగులుతప్ప వేరొకటిలేదు. వారు చేసినపనికి మనంఅంతా సెబాసుఅంటున్నాము. బళ్ళారి విషయంలో "ప్రభుత్వమువారు ఏమీచేయలేదు, చాలా మెత్తగాఉన్నారు, మైసూరువారు చాలా కఠినంగా ఉన్నారు. హనుమంతయ్యగారు కేంద్రప్రభు త్వాన్ని దబాయించారు, మీరు దబాయించలేదు" అని కొంతమంది చెప్పారు. దబాయిస్తే పనిఅయితే దబాయించడానికి మాకేమీ ఆక్షేపణలేదు. కాని అక్కడ దబాయింపులు చూచేవారు ఎవరూలేరు. కాబట్టి, దబాయింపులవల్ల వస్తుందనిగాని,

Dr. B. Gopal Reddi] [4th April 1956

మనం కృషిచేయలేదనిగాని అనుకోవడము న్యాయముకాదు. మేము డిల్లి వెళ్ళినప్పుడల్లా, పండిట్ జీ గారిని పంత్ గారిని, దేబర్ గారిని, కేంద్రప్రభుత్వంలో ఉన్న ఇంకా కొందరు పెద్దలతోనూ మేము చెప్పగలిగినంతవరకు చెప్పాము. వారికి S.R.C. రిపోర్టుఅంతాకూడా చదివి వినిపించినాము. "After very serious consideration" అనేమాటలు వారు వాడినారని, మేము పదేపదే చెప్పినాము. ఈ విషయంలో మేము ఎలాంటిలోపము చేయలేదు. సత్యనారాయణరాజుగారుగాని, సంజీవరెడ్డిగారుగాని, నేనుగాని, కాశీశ్వరరావుగారు గాని చేయవలసినదంతా చేశాము. బళ్ళారివారు ఇంకా కొంతమంది; చలికాలములో, అక్కడ చలికి లెఖ్ఖ చేయకుండా ఎంతో డబ్బు ఖర్చుపెట్టుకొని డిల్లిలో కూర్చొని ఎన్నో ప్రయత్నములు చేశారు. వారు ఇంకొక విషయం చెప్పారు. వారుచెప్పిన విషయములన్నీ ఇక్కడచెబితే ఏదో నా అభిప్రాయము అని మీరు అనుకొంటారు. ఏమైనప్పటికి మేము ఏదో ఒక నిర్ణయము చేసినాము. దీనికి ప్రత్యేకంగా జడ్జిఅయిన మిశ్రాగారిని పంపించాము. మిశ్రాగారు ఆ విధంగా తీర్పుఇచ్చారు. కేంద్రప్రభుత్వము వారు ఆ తీర్పును అంగీకరించి అమలుజరిపారు 2½ సంవత్సరములు అయిపోయింది. "We cannot go on reopening, Decided issues" అనివారు, బళ్ళారి విషయంలో ఎన్నిచెప్పినప్పటికికూడా వారు territory ని మనకు ఇచ్చుటకు ఒప్పుకోవడంలేదు. తుంగభద్ర నీటివిషయములో మీకు ఏరక్షణలు కావలయునన్నా ఇస్తాము. ప్లానింగు కమీషనువారు మీకు సరియైన న్యాయము కలుగజేసేట్లుగా చూస్తారు. అన్ని హామీలను వారు ఇచ్చారు. వాటిని ఈ బిల్లులోకూడా స్పష్టపరిచారు. మొన్న గవర్నరు సమావేశములోకూడా ఈ విషయము చర్చకు వచ్చింది. తరువాత జరగవలసిన కార్యక్రమముఅంతా జరుగుతున్నది. ఏమైనాసరే నీళ్లు విషయములో మీకు న్యాయము కలుగజేస్తాము. భూభాగంమాత్రం అడగవద్దు అంటున్నారు. S. R. C. Report ను కూడా వారు quote చేస్తున్నారు. (S. R. C, వారు నీళ్లకోసంమాత్రమే ఆ భూభాగమును ఆంధ్రలో కలపాలన్నారు అని చెబుతున్నారు Administrative links, Commercial links, Economic links ఏవో ఉన్నాయని చెప్పి ఈ territories అన్నీకూడా ఆంధ్రకు ఇస్తే బాగుంటుంది అని చెబుతున్నారు. అక్కడ ఆంధ్రులకు మెజారిటీ ఉన్నదా, మైనారిటీ ఉన్నదా అనే విషయమే వారు ఆలోచించలేదు. నీళ్ల విషయంలో మనకు ఏమాత్రం అన్యాయము. కలుగకుండా చూస్తాము, గాని భూభాగంమీద ఇదివరకే 2½ సంllల క్రిందట ఒక నిర్ణయముచేశాము "We dont want to reopen that" అనే attitude లో కేంద్రప్రభు

త్వమువారు ఉన్నారు. కట్టాగారుకూడా ఆవిషయమే చెప్పినారు. అందువల్ల ఇప్పుడు ఆ విషయంలో మనము ఏమిచేయలేము. రామిరెడ్డిగారు ఇక్కడలేరు. ఇంతకుమునుపువారు, ఆంధ్రులు ఉత్తేజమైన పద్ధతిలో యుద్ధము చేయాలని, ఇంకేదో చేయాలని చెప్పినారు. మనం ఎవరిమీద యుద్ధానికి పోవడానికి వీలులేదు. ఈ భారతవర్షమునకు వ్యతిరేకంగా ఏమిచేయడానికి వీలులేదు. ఎక్కడనో అక్కడ మనం చేయవలసిన ప్రయత్నము అంతా చేయవచ్చును. పదేపదే చెప్పవచ్చును. మనకు claim ఉన్నదని వారికి నచ్చ చెప్పవచ్చును. తీర్పుచెప్పేవారు మనకు అనుకూలంగా లేనప్పుడు, సమయంకోసం మనం కాచుకొని యుండాలి 20 యేండ్లకో, 25 యేండ్లకో మన agitation ఎక్కువ అయి కాలక్రమేణా మార్పు రావచ్చును. రాకపోతే మనకు case లేదేమో అనుకోవాలి. కాబట్టి ఈ విషయములో మనం ఇదమిద్ధమైనట్లు చేయడానికి వీలులేదు అది ఎట్లా జరుగుతున్నది, ఇకముందు ఎట్లా ఉంటుంది, అని చెప్పడానికి వీలులేదు. ఈ విషయంలో మనకు లోపం జరిగిందని ఎవరు అయినా అంటే వారిమాటలు నమ్మవద్దు. అది న్యాయమైన విషయముకాదు. బళ్ళారికంటేకూడా మనకు పర్లాకిమిడి, చాలా stronger case అని నేను అనుకొంటున్నాను. బళ్ళారి ఇప్పుడు మనకు చాలా అవసరముగా యున్నది. 2½ సంవతరములక్రిందట మనచేతులనుంచి విడిపోయినది. మనకు ఈనాడు తుంగభద్ర కాలువలు కావలసి ఉన్నాయి. 20 కోట్లరూపాయలు ఖర్చుపెట్టి మనం తుంగభద్ర ప్రాజెక్టును కట్టుకొంటున్నాము. అటువంటి పరిస్థితులలో బళ్ళారి మనకు చాలా అవసరం. అది మనకు చాలాదగ్గరగాకూడా యున్నది 2½ సంవత్సరముల క్రిందే అది విడిపోయింది. కాబట్టి మనకు ఇంకా బళ్ళారివిషయం జ్ఞాపకముయున్నది. Linguistic గా చూస్తే ఇంతకుముందు ఎన్నికలకు నిలబడిన వారినిబట్టిచూస్తే మనకు బళ్ళారికన్నా కూడా పర్లాకిమిడి ఎక్కువ stronger case గా ఉన్నట్లున్నది. మనం అది రావలయునని ఇది రావలయునని ఆందోళనలు జరిపేదానికన్నా ఒక బౌండరీకమీషను ఏర్పాటుచేయమని కోరితే బాగుంటుంది. దానికి తెలంగాణావారు కూడా అంగీకరించారు. ఒరిస్సా, మద్రాసు, మైసూరు, మహారాష్ట్ర, రాష్ట్రముల నుంచి మనకు రావలసిన భాగాలు అన్ని మనకు రావాలి. వాటికొరకు బౌండరీ కమీషనును నియమిస్తే బాగుంటుంది. అందువల్ల ఈ విషయములలో ప్రభుత్వము నిర్లక్ష్యముచేసినా యనిగాని ఉదాసీనత చూపించినారనిగాని అనడము న్యాయముకాదు. కోటయ్యగారుకూడా ఒకతట్టు ఉదాసీనత ఉన్నదని, ఇంకొకతట్టు ఉదారత ఉన్నదని చెప్పారు చేయవలసిన కార్యక్రమము అంతా ప్రకాశంగారి మంత్రివర్గంవారు ఇప్పటి మంత్రివర్గమువారు చేసినారేగాని వెనుకంజవేయలేదు. ఆమాదిరిగా జరిగినప్పటికి కేంద్రంవారియొక్క నిర్ణయము మనకు వ్యతిరేకంగా ఉన్నది తీర్మానమునకు

నేను పెట్టిన official motions కు కాశీశ్వరరావుగారు ఒక amendment పెట్టారు. బళ్ళారివిషయములోమాత్రం కాంగ్రెసుపార్టీవారు ఇష్టమువచ్చినట్లుగా ఓటుచేయవచ్చును. దాంట్లో whip ఏమీలేదు. మీ ఇష్టమువచ్చినట్లు హృదయపూర్వకంగా ఆలోచించి ఓటుచేయండి. అట్లాగే కమ్యూనిస్టుపార్టీనాయకుడుకూడా వారి పార్టీకి చెప్పవచ్చును. ఈ విషయం నేను గట్టిగా చెబుతున్నాను. House యొక్క sense ఏవిధంగా ఉన్నదో, ఇక్కడ ఉండే గౌరవనీయులైన సభ్యుల యొక్క అభిప్రాయము ఏవిధంగా ఉన్నదో, ప్రజానీకానికి తెలియజేయడానికి వీలుగా ఉంటుంది. గౌరవసభ్యులందరినీ మరల హృదయపూర్వకంగా అభినందిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

MR. SPEAKER —The question is

> This House recommends that the States Reorganisation Bill, 1956 be introduced in Parliament.

The motion was carried *nem con.*

SRI PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, ఇప్పుడు బిల్లుకు amendment move చేస్తున్నారా ?

MR. SPEAKER :—The official amendment will be moved to-day and the other amendments will be considered to-morrow.

THE HON. DR. B. GOPALA REDDI :—We are suggesting official amendments to the Bill.

SRI PILLALAMARRI VENKATESWARLU :—These are motions and not amendments to the Bill.

THE HON. DR. B. GOPALA REDDI :—No.

SRI PILLALAMARRI VENKATESWARLU :—The Hon. Speaker has given a ruling like that.

MR. SPEAKER :—ఏమంటారు ?

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇది బిల్లుకు సవరణలుగా ఉండవలెనని అని నా అభిప్రాయం.

4th April 1956]

MR. SPEAKER —You please hear them and we shall see what they are.

SRI PILLALAMARRI VENKATESWARLU .—They are being distributed.

THE HON. DR B GOPALA REDDI .—Mr. Speaker, Sir, I beg to move :

"And on such consideration

(1) This Assembly welcomes the merger of Telangana area with the State of Andhra ;

(2) This Assembly also welcomes the formation of Zonal Councils as suggested in the Bill ;

(3) This Assembly resolves that the State of Andhra formed with the transferred territories of Hyderabad shall be known as the State of Andhra Pradesh ;

(4) That the seat of the Government and the seat of the High Court shall be at Hyderabad ;

(5) That the Members to be elected to the Assemly from the transferred territories of Hyderabad in the semi-general elections provided in the Bill shall continue for a period of five years from the first meeting of the Assembly after such elections, and that notwithstanding anything to the contrary in the Constitution, the duration of the term of all the Members of the present Assembly of the State of Andhra shall be made co-terminus with the term of the Members elected as aforesaid, so that the general elections in this State also may fall in line with the general elections in the rest of States to be held in 1962 ,

(6) This House further recommends that the State of Andhra with the transferred territories from

the Hyderabad State be treated as a "new State" for the purposes of the Bill ;

(7) This House further resolves that there shall be a Legislative Council for this State consisting of 72 Members on the lines suggested in the Bill for the formation of Legislative Council for the State of Madhya Pradesh , and

(8) This House further resolves that Boundary Commission or Commissions shall be appointed by the Government of India to examine, suggest and effect territorial adjustments with the neighbouring States of Orissa, Madhya Pradesh, Maharashtra, Mysore and Madras."

SRI PILLALAMARRI VENKATESWARLU .—ఇప్పుడు మా a nendmets కూడా ఉన్నవి.

MR. SPEAKER :—It does not require any speech. Article 3 requires that the views of the Legislature of the State or, as the case may be, of each of the States both with respect to the proposal to introduce the Bill and with respect to the provisions thereof have to be ascertained by the President The first stage is over and we are now proceeding to the second stage. With regard to the second stage, the Chief Minister is now placing before the House approval of some of the provisions and modifications in respect of some other provisions of the Bill

SRI PILLALAMARRI VENKATESWARLU:—మనకుపూర్వం experience కూడా వుంది. Andhra State Bill కూడ similar lines మీదనే Madras State లో discuss చేసినాము. అప్పుడు మనము clause by c ause గా మన అభిప్రాయములను record చేసి పంపించినాము. దానిమీద amendments తీసుకొని రావచ్చును. దానికి నాకేమీ అభ్యంతరంలేదు. దీనినంతా ఒక resolution క్రింద consider చేసి దానికి ఒక motion తోటి ముఖ్యమంత్రి గారు వస్తున్నారు. Now what is it before the House, whether this Bill or the Chief Minister's motion ?

దీనంతాకూడ ఒక amendment మాదిరిగా consider చేయుటకు నాకు అభ్యంతరములేదు.

MR. SPEAKER :—All of them are not amendments. "This Assembly welcomes the merger of Telangana area with the State of Andhra". Is it an amendment? It is an expression of view. "This Assembly also welcomes the formation of Zonal Councils as suggested in the Bill." Is it as amendment? It is an expression of view.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ బిల్లులో clauses ఉన్నాయి. Andhra State Bill విషయంలోకూడా similar lines లోనే discuss చేసినాము. Madras లో amendments pass చేయడం జరిగింది. వాటన్నింటినీ పార్లమెంటు opinion కొరకు పంపించినాము.

On similar lines we are discussing this Bill here. I don't know what procedure you are following.

దాంట్లో ఉన్న suggestions నన్నింటినీ Chief Minister గారు ఒక amendment రూపంలో తీసుకొరావలెనని నా ఉద్దేశ్యం. ఇప్పుడు ఒక motion ను move చేశారు. దాని పరిస్థితి ఏమిటి? మేము దానిమీద ఓటుచేయవలెనా? లేక Bill లో ఉండే amendments మీద ఓటుచేయవలెనా?

MR. SPEAKER :—You will have to vote on them.

SRI PILLALAMARRI VENKATESWARLU :— No Sir, I refuse to take part in it. దీంట్లో amendments move చేయుట తగినపద్ధతి. Constitution లో కూడా అలా చేయవలెననే వున్నది.

MR. SPEAKER :—You bring in your amendments. If they are admissible, I shall allow them.

SRI PILLALAMARRI VENKATESWARLU :—We will move amendments to the Bill and not to the resolution. ఎక్కడా లేని provision ను మనం యిప్పుడు తీసుకు వస్తున్నాము. That is my complaint.

MR. SPEAKER :—The President did not ask us to give any amendments to the Bill as the House is not competent to

[4th April 1956

amend that Bill All that the President wants us to do is to express our views regarding introduction and regarding the various provisions of the Bill. Regarding various provisions of the Bill we are expressing our approval with respect to some of them and we are expressing modifications to some others. You come on with your amendments. I will give the form to them.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, Andhra State formation కు సంబంధించినటువంటి clauses అన్నీ కలిసి Bill రూపంలో నే వచ్చాయి. ఆ Bill ను చర్చించినప్పుడు మొదట consideration stage కి తీసుకువచ్చి, దానిమీద general discussion జరిగినతరువాత clause వారీగా amendments పంపించి ఆ amendments ప్రకారంగా తీర్మానం చేసి, ఇంకా అదనంగా చేయవలసిన resolutions ఉంటే అవి pass చేసి, ఇవన్నీ మొత్తంగా కలిపి పంపించినాము. ఆ resolutions అన్నీ వారు consider చేసినారు. ఆ Bill లో ఏమిమార్పులు చేయాలో అవన్నీ కూడ పార్లమెంటు discuss చేసినది. తరువాత ఒక statement కూడ దాంట్లో ఉండడం అవసరమని సుబ్రహ్మణ్యంగారు ఇచ్చిన statement దానితో కలిపి పంపించినాము. ఈ బిల్లును కూడ మనం చర్చచేసి ప్రతిక్లాజుమీద మన అభిప్రాయములను ప్రస్ఫుటపరచిన తరువాత దాంట్లో ఇంకా ఏమైనా general clauses ఉన్నట్లయితే ఒక amendment రూపంలోనో, statement రూపంగానో తీసుకురావడం సహజం. కాని మేము వీటన్నింటినీ discuss చేయకుండా తీర్మానంమీదనే discuss చేస్తామని అనడం సరియైన పద్ధతి కాదు. (మీరు ఇంకా ఖచ్చితంగా చెప్పలేదనుకోండి). కాబట్టి తమరు దయ ఉంచి ఈ విషయంలో ఆలోచించి మనం clause వారీగా discuss చేయుటకు అంగీకరించమని కోరుతున్నాను. మనం క్లాజువారీగా discuss చేసినతరువాత మనసలహాలు ఏమో చెప్పవచ్చు. ఈ మాదిరిగా ఉపరికించి పంపించుటకు ప్రధానంగా clause వారీ discussion కావాలి.

THE HON. DR. B. GOPALA REDDI :— ఈ బిల్లులో లక్ష దీవులు అండమాను దీవులు, త్రిపుర, మణిపూర్ ల విషయంకూడా ఉన్నది. వీటన్నింటిమీద మనం amendments పెడితే దానిమీద చర్చచేసిన తరువాత మీ అభిప్రాయములను చెబుదామనా మీ ఉద్దేశ్యము? ఇప్పుడు లక్ష దీవులను Central administration క్రిందకు తెద్దామంటున్నారు అట్లు జరుగకూడదు, మద్రాసులో ఉండాలని మనం చెప్పడం ఏమంత న్యాయంగా ఉంటుంది? దానికి ఏమి విలువఉంటుందో ఆలోచించు

కొనండి. Andhra State Bill మన ఆంధ్ర రాష్ట్రమునకు సంబంధించినది కనుక ఆ బిల్లులోని క్లాజులను మనం discuss చేయుటకు మనకు అధికారం ఉన్నది.

హైకోర్టులు మున్నగునవి మనకు సంబంధించినవి ఉన్నాయి. ఈ బిల్లులో అనేక రాష్ట్రములకు సంబంధించిన విషయములన్నీ ఉన్నాయి. మనకు ఎంత వరకూ ఉన్నవో వాటన్నింటినీ మనం చర్చించుకొనవచ్చును. ఆ విషయముల నన్నింటినీ నేను సాధ్యమైనంతవరకు నా తీర్మానములో క్రోడీకరించియున్నాను అసలు నేను చేసిన motion మీదనే కదా ఈ తీర్మానం వచ్చినది? "The bill may be taken into consideration" అనే ప్రతిపాదన లేకపోతే ఈ చర్చ లేదుకదా? ఈ బిల్లు తయారవుతూండగానే, publish అవుతూండగానే ఇక్కడకు రాలేదు. దానిని ఏదైనా official motion ని సవరణపెడితే మంచిదేగాని బొంబాయి సంగతి మేము చెపుతాము, మణిపూర్ సంగతి మేము చెపుతాము అంటూ చెబుతూంటే కాలహరణం అయిపోతుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, సభానాయకుడు ఒక తీర్మానం తీసుకువచ్చినందువలననే చర్చ జరుగుతున్నది. చర్చ జరిగిన తరువాత ఆ బిల్లును తీసుకొనివచ్చి మాముందు పెడుతున్నారు. ఆంధ్ర రాష్ట్ర బిల్లు ఆంధ్ర రాష్ట్రమున కంతటికీ సంబంధించినది కనుక ఇందులోని ప్రతి క్లాజుకూడ చర్చించుటకు అవకాశమిచ్చారు ఈ దేశమునకు సంబంధము లేని కొన్ని సమస్యలుకూడ ఇప్పటి బిల్లులో వున్నాయి. అవి ఎందుకు చర్చ చేస్తారని అడుగుతున్నారు. దీనిని గురించి Article (3) లో clear గా ఉంది మనకు సంబంధించిన విషయములేమి ఉన్నవో వాటినిగురించి మన అభిప్రాయమును తెలుసుకొనుట కొరకు కేంద్ర ప్రభుత్వంవారు మనకు బిల్లు పంపించారు. మనకు సంబంధించిన విషయాలేమి ఉన్నవో అవన్నీ మనం క్లాజు వారీగా చర్చిద్దామని నేను మనవి చేస్తున్నాను. దీంట్లో ఏమైనా లోటుపాట్లు ఉన్నట్లయితే సభానాయకుడు ఇప్పుడు చెప్పిన తీర్మానమును తీసుకొని వచ్చినట్లయితే మనం చర్చించుటకు అవకాశం ఉంటుంది. అంతేకాని అసలు క్లాజులన్నీ క్రోడీకరించి నేను తీర్మానం తీసుకొని వచ్చినాను, మీరు చర్చ చేయండి అనడం న్యాయంకాదు అటువంటప్పుడు ఈ బిల్లు మాకు ఇవ్వడం అనవసరం. ఇటువంటిది రాబోతున్నది. "మీరు ఒప్పుకోండి" అని general గా చెప్పవచ్చును. మాకు ఇచ్చిన తరువాత వారి తీర్మానమును తీసుకొనిరావచ్చును. ఆ తీర్మానంమీద amendments పెట్టవచ్చును. కేంద్ర ప్రభుత్వం క్లాజులో ఉన్నటువంటి positions ను అన్ని రాష్ట్ర ప్రభుత్వములకు పంపించింది అన్ని రాష్ట్రాలు క్లాజువారీ చర్చలు జరుపుకొంటున్నాయి. Article (3)లో "concerned States must discuss" అని clear గా ఉన్నది.

అసలు మనం discusss చేసేది ఏమిటి? మనం generalగా discuss చేసినాము. బాగానే వున్నదని అనుకొంటున్నాము. అసలు క్లాజువారీగా amendmentsతో సహా discuss చేయవలసిన అవసరం ఉంటుందని నేను మనవిచేస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ముఖ్యమంత్రి గారు మాట్లాడుతూ services ను గురించికూడా discuss చేస్తామని చెప్పారు.

THE HON. DR. B. GOPALA REDDI.—It is a bald official resolution. మీరు services గురించి చెప్పదలచుకుంటే appropriate section కు ఒక amendment పెట్టండి. అప్పుడు ఏవిషయం కావలసి ఉంటే ఆ విషయం చర్చించుకోవచ్చు. But let this be the base.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, అసలు వారు move చేసినటువంటి resolution ను baseగా తీసుకోవడానికి వీలులేదని మా contention. గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లుగా మనకు సంబంధించినంతవరకు మనం discuss చేయాలని మీరు ruling ఇచ్చినట్లయితే మాకు అభ్యంతరంలేదు. వాటిమీదనే amendments move చేస్తాము. ఆ clause కు సంబంధించిన amendments move చేస్తాము. మిగిలినది మీరు rule out చేయవచ్చు. కాని అదేది జరుగకుండా నేను ఒక resolution move చేస్తున్నానని Chief Minister గారు చెప్పారు. అసలు ఈ బిల్లు discussion కు ఏవిధంగా వచ్చిందని అడిగారు. ప్రతిబిల్లు వచ్చినట్లె ఈ బిల్లుకూడా వచ్చింది. ప్రతిబిల్లు ప్రవేశపెట్టేటప్పుడు let this bill be taken into consideration అని అంటారు. తరువాత 1st reading, 2nd reading, 3rd reading జరుగుతాయి. 2nd reading లో clause by clause discuss చేస్తాము.

MR SPEAKER :—So according to you, each clause will have to be moved and carried, and in this way proceed clause by clause of the whole Bill and then proceed to the third reading stage, saying that the Bill be passed into law.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Yes.

THE HON. DR. B. GOPALA REDDI :—Ours is only a recommendation.

MR. SPEAKER :—Mr. Venkateswarlu: what you say is not at all the procedure we can adopt here. I have no objec-

tion to take your amendments to the clauses. We have only to make recommendations.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ముఖ్యమంత్రి గారు ఇచ్చినటువంటి statement ను basis గా తీసుకోమని అంటున్నారు. We are not prepard to accept it. కనుక చర్చ ప్రారంభించినపుడు ఈ బిల్లు మనముందు ఉన్నది. Consolidated గా మొట్టమొదటే తీసుకురావలసిన motion ఇప్పుడు ఎందుకు తీసుకువస్తున్నారు ?

THE HON DR. B GOPALA REDDI :— మొట్టమొదటే తీసుకు వచ్చి ఉండవచ్చు. అసలు ప్రజలయొక్క అభిప్రాయం ఏవిధంగా ఉన్నదో 3 దినముల చర్చ అయినతరువాత ప్రజాభిప్రాయం అంతా క్రోడీకరించి నా అభిప్రాయాన్నికూడ సమన్వయం చేసుకొని తెలంగాణా నాయకులతో సంప్రదించడానికి అవకాశం ఉంటుందని చివరకు పెట్టాము. Otherwise, I could have moved the motion straight away on the first day itself. రాష్ట్రం పేరు విషయంలో, హైకోర్టువిషయంలో ఏమి చెబుతారో తెలుసుకొన్న తరువాత కడపట ప్రభుత్వాభిప్రాయం చెబుదామనుకొన్నాను.

MR. SPEAKER :— You may come by way of resolution or amendment ; you are welcome. Why all this unnecessary discussion ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, ఇప్పుడు clause వారీగా amendments తీసుకురావచ్చును. దానికి బిల్లు అంతా తీసుకు రావలసి ఉంటుంది. కాని resolution తీసుకుని రావడం సరైనపద్ధతిగాదు.

MR. SPEAKER :—Why are you worried about the official amendments ? If you have got any amendments, come forward with them.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఇప్పుడు clause వారీగా చర్చ జరిగిన తరువాత Third reading చేస్తామని ఒక సూచన మీరు ఇందాక చేశారు. ఇదంతా recommendatory అవుతుంది.

MR. SPEAKER :—Please bear this in mind. The form is immaterial. It is only expression of our opinion that is wanted by the President.

[4th April 1956

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—రెండూవున్నాయి. Form, expression of opinion, రెండూ అవసరమే.

MR SPEAKER :—The form is immaterial. The President wants our opinion with respect to the various clauses of the Bill. It may be by way of a resolution, or by way of an amendment, or by way of a motion, or in whatever form you desire What all is wanted is the unequivocal expression of opinion of this House regarding the various clauses of the Bill pertaining to our State.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Clause వారీగా amendments move చేసినతరువాత final propositions పెడితే అందరికీ ఆమోదకరంగా ఉంటుందని మనవిచేస్తున్నాను.

MR. SPEAKER :—మీరు సవరణలు తెచ్చినతర్వాత ఆచర్చ సాగిద్దాము. How they fit in is a question? We shall consider it to-morrow. If they are relevant, we shall see what form we have to adopt. వారు move చేసే resolution విషయం మీకెందుకు? The Government have expressed their opinion approving certain provisions of the Bill and suggested modifications to some other provisions in a comprehensive resolution.

SRI PILLALAMARRI VENKATESWARLU .—అది fit-in అవుతుందాకాదా అనే అనుమానం ఉన్నది అది ఏ విధంగా fitin అవుతుంది అనే సమస్య ఉన్నదిగనుక, ఏ Form లో తయారుచేయమంటే ఆ form లోనే తయారుచేస్తాము.

MR SPEAKER.—We shall give the form to them consistant with the Constitution and consistant with the letter of the President

SRI E. AYYAPU REDDI :—Mr. Speaker, Sir, when once it is conceded that our powers are only recommendatory and not legislative, our friends there, even at this stage, if they want to suggest any amendments, or if they want to express their opinion on any clause, can say, 'and on such consideration this Assmbly resolves that such and such words shall be substituted in such and such a clause'. That is the

proper form of bringing amendments or expressing their opinion on the main Bill itself. Sir, till now we have been adopting the proper procedure and our friends there can give their amendments to the resolution of the Government itself or to the Bill.

MR. SPEAKER :—That is what I am suggesting to them. The House will now adjourn and meet to-morrow at 8-30 a.m.

The House then adjourned.